బాలానంద బొమ్మల

# డేవిడ్ కాపర్ ఫీల్డ్



మూలం :

**చార్లెస్ డికెన్స్**

స్వేచ్ఛానుసరణ :

**సింగంపల్లి అప్పారావు**




**నవరత్న బుక్ హౌస్**

కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ-520002.

బాలానంద బొమ్మల డేవిడ్ కాపర్ ఫీల్డ్
రచన:
సింగంపల్లి అప్పారావు

ప్రథమ ముద్రణ :
నవంబర్ 2000

ముఖచిత్రం :
రవి
లోపలి బొమ్మలు :
వి.యస్. ప్రకాష్


28-22-20, రహిమాన్ వీధి
అరండల్ పేట, విజయవాడ-2
ఫోన్ : 432 813

ముద్రణ :
డి. బి. ప్రింటర్స్
విజయవాడ-2

వెల : రు. 25.00

## విద్యార్థినీ విద్యార్థులకు అమూల్య నేస్తాలు

ఇంగ్లీష్-తెలుగు డిక్షనరి
తెలుగు-ఇంగ్లీష్ డిక్షనరి
హిందీ-తెలుగు డిక్షనరి
తెలుగు నిఘంటువు
త్రిభాషా డిక్షనరి
తెలుగు-హిందీ డిక్షనరి
ఇంగ్లీష్-ఇంగ్లీష్ డిక్షనరి
ఇంగ్లీష్-హిందీ డిక్షనరి
హిందీ-ఇంగ్లీష్ డిక్షనరి
రసాయన శాస్త్ర నిఘంటువు
జంతుశాస్త్ర నిఘంటువు
వృక్షశాస్త్ర నిఘంటువు
గణితశాస్త్ర నిఘంటువు
భౌతికశాస్త్ర నిఘంటువు
ఇంగ్లీష్ వ్యాసాలు-లేఖలు
హిందీ వ్యాసాలు-లేఖలు
తెలుగు వ్యాసాలు-లేఖలు
ఇంగ్లీష్ గ్రామర్
హిందీ గ్రామర్ (హైస్కూల్)
హిందీ గ్రామర్ (డిగ్రీ)
లాఫ్టీ జోక్స్
త్రిభాషా వ్యాకరణం
ఎంకిపాటలు
హితవాహిని

తెలుగు వ్యాకరణము
సులభ వ్యాకరణము
45 రోజుల్లో ఇంగ్లీష్
45 రోజుల్లో హిందీ
ఇంగ్లీష్ తెలుగు స్వబోధిని
హిందీ తెలుగు స్వబోధిని
గణిత ఒలింపియాడ్ (తెలుగు)
గణిత ఒలింపియాడ్ (ఇంగ్లీష్)
గణిత సూత్రములు
గణితము-సమస్యలు-సాధనలు
ప్రాథమిక గణిత శాస్త్ర స్వబోధిని
అంక గణితం
గణితశాస్త్రం (బీజగణితం)
స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్
ఫోటోగ్రఫీ నేర్చుకుందాం
తెలుగు సామెతలు
ఇంగ్లీష్ తెలుగు సామెతలు
మీ ఆంగ్ల పదజాలం పెంపొందించుకోండి
జోక్స్ వరల్డ్
1001 జోక్స్-జోక్స్-జోక్స్
1001 వింతలు-విచిత్రాలు
నవ్వులు
ఖగోళశాస్త్రం-క్విజ్
కార్టూన్లు

## బాలసాహిత్యంలో - బంగారు మొలకలు

బాలానంద బొమ్మల షిరిడీ సాయిబాబా
" అరేబియన్ నైట్స్ అద్భుత కథలు (3 భాగాలు)
" షేక్స్‌పియర్ అద్భుత కథలు(3భాగాలు)
" బైబిల్ కథలు (2 భాగాలు)
" సింద్‌బాద్ సాహస యాత్రలు
" రాబిన్‌సన్ క్రూసో సాహస యాత్రలు
" డాన్ క్విక్సోట్ సాహస యాత్రలు
" రాబిన్‌హుడ్ సాహస యాత్రలు
" రెండు మహానగరాల కథ
" డేవిడ్ కాపర్ ఫీల్డ్
" ఆలివర్ ట్విస్ట్
" రాజు - పేద
" ప్రపంచ అద్భుత కథలు
" పంచ తంత్రం (2 భాగాలు)
" రామాయణం
" భారతం
" భాగవతం
" దశావతారాలు
" శ్రీకృష్ణలీలలు
" టిప్పుసుల్తాన్
" వీరపాండ్య కట్టబ్రహ్మన

బొమ్మల మర్యాద రామన్న కథలు
" అల్లావుద్దీన్ అద్భుత దీపం
" ఆలీబాబా 40 దొంగలు
" అక్బర్ బీర్‌బల్ వినోద కథలు
" భేతాళ కథలు
" తెనాలి రామకృష్ణ కథలు
" పరమానందయ్య కథలు
" భట్టి-విక్రమాదిత్యుల కథలు(2భాగాలు)
" అపూర్వ చింతామణి
" కాశీ రామేశ్వర మజిలీల కథలు
" గలివర్ సాహస యాత్రలు
" భగత్‌సింగ్
" బి. ఆర్. అంబేద్కర్
" సుభాష్‌చంద్రబోస్
" అజాద్ చంద్రశేఖర్
" రాజా రామమోహనరాయ్
" మదర్ థెరిసా
" రవీంద్రనాధ్ టాగూర్
" జయప్రకాష్ నారాయణ్
" యోగి వేమన
" పూజ్య బాపూజి
" భగవతీచరణ్

# డేవిడ్ కాఫర్ ఫీల్డ్

నా పేరు 'డేవిడ్‌కాఫర్‌ఫీల్డ్!'— నేను పుట్టడానికి ఆరునెలల ముందే మా నాన్న చనిపోయాడు. అప్పటికి, మా నాన్న వయసు నలభై సంవత్సరాలు. మా అమ్మ వయసు పందొమ్మిది సంవత్సరాలు.

నాకొక మేనత్త ఉంది. ఆమె పేరు 'బెట్ సేట్రాట్‌ఉడ్!' సన్నగా బలహీనంగా వయసులో చాలా చిన్నది అయిన మా అమ్మను వివాహం చేసుకోవడం మా మేనత్తకు ఇష్టం లేకపోయింది. ఆ విషయంలో మా మేనత్త మా నాన్నతో తగువుపడి వెళ్ళిపోయింది. ఆమె మా నాన్న వివాహానికి రాలేదు. చనిపోయాక కూడ రాలేదు. మా అమ్మ ఎలా ఉంటుందో కూడ మా మేనత్తకు తెలియదు.

ఒకరోజున మా మేనత్త అకస్మాత్తుగా ఊడిపడింది. తన్నుతాను పరిచయం చేసుకుంది. మా అమ్మ ఆమె పేరు వినడమే కానీ ఎన్నడూ చూడలేదు. సాదరంగా లోనికి ఆహ్వానించింది.

"చిన్నపిల్లను చేసుకోవద్దురా! నీ వయసుకు తగిన అమ్మాయిని చేసుకో! అని మా అన్నయ్యకు ఎంతో నచ్చచెప్పాను. అయినా వాడు వినలేదు. ఇప్పుడు చూడు ఏమైందో! నువ్వు విధవరాలివయ్యావు కదా!.... ఇప్పుడు ఎటూ ఆధారంలేని బాలింతరాలివి. నిన్నెవరు చూస్తారు?.... నీకు కూతురు పుట్టిందని తెలిసింది. అందుకే రెక్కలు కట్టుకు వచ్చాను. నీ కూతుర్ని నేను తీసుకువెళ్ళి పెంచుతాను. నాకు తోడునీడగా ఉంటుంది. దానికి 'బెట్ సేట్రాట్‌వుడ్ కాఫర్‌ఫీల్డ్' అని పేరు పెడతాను.... నువ్వు మరొక వివాహం చేసుకున్నా నీకు పిల్ల బెడద ఉండదు." అంది మా మేనత్త.

మా అమ్మ దుఃఖభారంతో ఏమీ మాట్లాడలేకపోయింది. అంతలో నన్ను చూసేందుకు మేడమీదికి వచ్చిన డాక్టర్ క్రిందికి దిగి వెళ్ళాడు.

"పాప ఎలా ఉంది డాక్టర్! బొద్దుగా నాలాగే ఉంటుందా?" అని మా మేనత్త డాక్టర్ని అడిగింది.

"క్షమించాలి! మీరు పొరపాటుగా విని ఉంటారు. పుట్టింది ఆడపిల్లకాదు.... మగ పిల్లవాడు!" అన్నాడు డాక్టర్.

అంతే! మా మేనత్త బల్లమీద పెట్టిన టోపీని అందుకుని నెత్తిన పెట్టుకుంది. మా అమ్మతో ఒక్కమాట అయినా చెప్పకుండా వెనుదిరిగి చకచకా నడుచుకుంటూ

వచ్చిన దారినే వెళ్ళిపోయింది. ఆ తర్వాత కొన్ని సంవత్సరాలకుగాని మా మేనత్తను చూడలేము.

రోజులు, నెలలు, సంవత్సరాలు గడుస్తున్నాయి. నేను పెద్దవాడి నవుతున్నాను.



డేవిడ్ పుట్టక ముందే అతడి తండ్రి చనిపోగా యిన్నాళ్ళకు అతడి తల్లి మరొక యువకుడితో ఇంటికి రావడం అతడికి ఆశ్చర్యాన్ని కలిగించుట

నేనూ, మా అమ్మా, మిస్ పెగోటే మేము ముగ్గురమే ఆ ఇంట్లో ఉంటున్నాము. అన్నట్లు పెగోటే ఎవరో చెప్పలేదు కదూ.

మిస్ పెగోటే మా ఇంట్లో సేవకురాలు.... ఆత్మబంధువు.... సలహాదారు....

మా బాగోగులు చూసే శ్రేయోభిలాషి! నేనంటే ఆమెకు వల్లమాలిన ప్రేమాభిమానాలు. నాకు ఎన్నో కథలు చెప్పేది. మంచి మంచి కబుర్లు చెప్పేది.

ఒకనాడు పెగోటి నేనూ రాత్రివేళ చలిమంట ముందు కూర్చుని మాట్లాడుకుంటున్నాము. మా అమ్మ పక్కింటికి వెళ్ళింది.

ఓ గంట తర్వాత మా అమ్మ తిరిగివచ్చింది. ఆమె ఒంటరిగా రాలేదు. వెంట మరొక యువకుడున్నాడు. పోయిన ఆదివారం మాతోబాటు చర్చివద్ద నుండి మా ఇంటి వరకూ తోడు వచ్చాడు.

అతడు నవ్వుతూ నా తలమీద చేయివేసి నిమిరాడు. అతడి స్పర్శ నాకు చీమలు, జెర్రులూ పాకినంత చిరాకు కలిగించింది.

అతడిపేరు మర్డ్‌స్టోన్! తరుచూ మా ఇంటికి వస్తుండేవాడు. మా అమ్మ చక్కగా ముస్తాబై అతడితో షికారుకు వెళ్తుండేది.

అతడంటే నాకు ఏవగింపు. అసహ్యం జుగుప్స కలుగుతూ ఉండేవి. అలా ఎందుకు కలిగేవో ఆ చిన్న వయసులో నాకు అర్థమయ్యేది కాదు. అతడు ఇంటికి వస్తే చాలు శత్రువును చూసినట్టు చూస్తూ ఉండేవాడిని.

ఒకనాటి రాత్రి నిద్రించడానికి మేడమీద వున్న నా పడకగదికి వెళ్ళాను. నా వెనువెంటనే పెగోటి కూడా వచ్చింది.

"చూడు మైడియర్ డేవీ! యార్‌మాత్‌లో నా కొక సోదరుడు ఉన్నాడు. మన మిద్దరం మా సోదరుని ఇంటికి వెళ్ళి ఓ పది పదిహేను రోజులు హాయిగా గడిపివద్దాం! అక్కడ ఉండే సముద్ర ప్రాంతం చాలా ఆహ్లాదకరంగా ఉంటుంది. వెళ్దాం వస్తావా?" అని పెగోటీ అడిగింది.

నేను సంతోషంగా అంగీకరించాను. మేము యార్‌మాత్ వెళ్ళేందుకు మా అమ్మ అన్ని ఏర్పాట్లు చేసింది.

పెగోటీ నేనూ, గుర్రపు బగ్గీమీద దూరంగావున్న యార్‌మాత్ చేరుకున్నాము.

అక్కడ మా కోసం 'హామ్' ఎదురు చూస్తున్నాడు. అతడు నన్ను అమాంతం ఎత్తుకుని భుజంమీద కూర్చోబెట్టుకుని ఇంటికి తీసుకు వెళ్ళాడు.

వాళ్ళ ఇంటివద్ద ఓ అందమైన పిల్ల వుంది. ఆ పిల్ల నన్ను సాదరంగా ఆహ్వానించింది. రాత్రివేళ మిస్టర్ పెగోటి ఇంటికి వచ్చాడు.

అందరం భోజనాల వద్ద కూర్చున్నాము!

“చూడండి మాస్టర్ డేవిడ్! మేము చూపులకు చాలా మొరటు మనుష్యుల్లాగ కనిపిస్తాము. కానీ మా మనసులు మాత్రం నవనీతం!” అన్నాడు మిస్టర్ పెగోటీ.

“చూడు డేవీ! అతడు మా అన్న. వివాహం చేసుకోకుండా బ్రహ్మచారి గానే ఉండిపోయాడు! హామ్ మా చనిపోయిన పెద్దన్న కొడుకు. ఆ పిల్ల ఉంది



పదిహేనురోజుల పాటు హాయిగా గడిపి రావటానికి డేవిడ్ తల్లి కొడుకునూ సేవకురాలు పెగోటీని గుర్రపుబండిమీద యార్మౌత్ పంపించుట

చూసావూ ఆమె చనిపోయిన మా పెద్దన్న బావమరిది కూతురు ఆ పిల్ల తండ్రి కూడా చనిపోతే మా అన్న తెచ్చి పెంచుతున్నాడు ఆ పిల్ల పేరు ‘ఎమిలీ’!.... హామ్‌నీ, ఎమిలీని మా అన్నయ్య దత్తత తీసుకున్నాడు, అందువల్ల వివాహం

చేసుకోలేదు." అని చెప్పింది మిస్ పెగోటీ.

ఆ తర్వాత నన్ను అక్కడ వదిలిపెట్టి పెగోటీ తిరిగి మా ఇంటికి వచ్చేసింది.

పదిహేను రోజులపాటు వాళ్ళతో ఆనందంగా గడిపాను. పదహారవరోజున



యార్‌మౌత్ నుంచి తిరిగి వచ్చిన డేవిడ్‌కి తన తల్లి మళ్ళీ పెళ్ళి చేసుకున్న విషయం తెలిసి మనసు బాగుండక తోటలోకి వచ్చుట!

నా కోసం గుర్రపు బగ్గీవచ్చింది. ఆ బండి మొదట మమ్మల్ని యార్‌మౌత్ తీసుకు వెళ్ళినదే!....

నేను ఆ బండిమీద ఇంటికి తిరిగి వచ్చాను. తలుపు గంటకొట్టాను. కొంత

సేపు గడిచిన తర్వాత పెగోటివచ్చి తలుపు తీసింది.

తలుపు తీయడానికి ఇంత ఆలస్యమేమిటి?" అని అడిగాను.

"నేను వంటగదిలో వున్నాను డేవీ! రావడానికి కొంత ఆలస్యమైంది!"

"అమ్మ ఇంట్లో లేదా?" అని అడిగాను.

"ఉంది!.... అయితే నీ కొక విషయం చెప్పాలి డేవీ!" అంటూ పెగోటీ వంట గదిలోకి వెళ్ళింది.

నేను వెనుకగా వెళ్ళాను....

"ఏమిటి విషయం పెగోటీ?" అని అడిగాను.

"మరేం లేదు. మీ అమ్మ వివాహం చేసుకుంది. నీకు కొత్త నాన్న వచ్చాడు. మీ అమ్మా, నాన్నా హాలులో కూర్చున్నారు. వెళ్ళి చూడు!" అంది పెగోటీ.

ఆ కొత్త నాన్న ఎవరో నేను గ్రహించాను. నాలో ఏదో తెలియని ఆవేదన ప్రారంభమైంది. వాళ్ళను చూడాలనిపించలేదు. నీళ్ళతో కళ్ళు మసకబారాయి. తిన్నగా నా పడక గదికి చేరుకున్నాను. అయితే అది నా పడక గదికాదు. అది పూర్తిగా మార్చివేయబడి ఉంది. అక్కడ కూడా ఉండబుద్ధికాక, ఇంటి వెనుక దారిగుండా ఆవరణలోనికి వచ్చాను.

అక్కడ ఒకప్పుడు, కుక్క కోసం ఓ చిన్న ఇల్లు ఉండేది కానీ, కుక్క ఉండేది కాదు. అయితే ఇప్పుడు అక్కడ ఓ పెద్ద కుక్క ఒకటి కట్టేసి ఉంది. అది నన్ను చూస్తూనే, భయంకరంగా మొరగడం ప్రారంభించింది.

'ఇంకా నయం. అది విప్పిలేదు. విప్పేసి ఉంటే, నన్ను చీల్చిచెండాడి ఉండేది!' అనుకుంటూ నెమ్మదిగా హాలులోకి వచ్చాను.

అక్కడ మా అమ్మ, మిస్టర్ మర్డ్‌స్టోన్ నెగడు వద్ద కూర్చుని ఉన్నారు. మా అమ్మ నన్ను చూస్తూనే, చప్పున లేవబోయి పడబోతూ, తన్ను తాను సంబాళించుకుంది.

"మైడియర్ క్లారా! ఏమిటా తొందరబాటు?" అన్నాడు మర్డ్‌స్టోన్.

ఆ మాటలో ప్రేమ గాకుండా, గద్దింపు వినిపించింది నాకు.

"యార్‌మౌత్‌లో, హాయిగా కాలక్షేపం అయిందా డేవిడ్?" అని అడిగాడు మర్డ్‌స్టోన్.

అతడికి ఏం సమాధానం చెప్పానో గుర్తులేదు. గబగబా పరిగెత్తుకుంటూ

మేడమీదికి చేరుకున్నాను. నా పడక గదికి వెళ్ళి మంచం మీద విసురుగా పడి పోయాను. ఎంతసేపు ఏడ్చానో తెలియదు. ఎప్పుడు నిద్రపోయానో కూడా తెలియదు.

ఎవరిదో ముఖం, నా ముఖాన్ని కప్పేసింది. ఎవరివో చేతులు. నా శరీ



ఏడుస్తూ నిద్రపోయిన కొడుకు ప్రక్కన పడుకుని అతడి తల్లి అతడి తలను గుండెలకు హత్తుకుని దుఃఖించుట.

రాన్ని ఆలింగనం చేసుకున్నాయి. అప్పుడు నాకు తెలివి వచ్చింది.

కళ్ళు తెరిచి చూద్దును గదా!....మా అమ్మ.... నా పక్కన పడుకుని, నా ముఖం వంకే చూస్తున్నది. మంచం సమీపంగా పెగోటీ నిలబడి ఉన్నది.

"డేవీ! నా మీద కోపంగా ఉందా బాబూ! నిస్సహాయురాలైన యీ తల్లిని క్షమించు తండ్రీ!" అంది మా అమ్మ ఏడుస్తూ.

"నీకేమైనా పిచ్చిపట్టిందా క్లారా!.... మనసు రాయిచేసుకోమని నీకు చెప్పానా, లేదా?" అన్న గొంతు వినిపించి తలతిప్పి చూసాను.

ఎదురుగా మర్డ్‌స్టోన్ నిలబడి ఉన్నాడు. మా అమ్మ భయం భయంగా అతడివేపు చూసింది. అతడు మా అమ్మను హొదివి పుచ్చుకుని మంచంమీది నుండి పైకి లేవదీసాడు.

అతడు మా అమ్మ బుగ్గమీద ముద్దు పెట్టుకుంటూ "నువ్వు పెగోటీని తీసుకుని క్రిందికి వెళ్ళు!....నేను, డేవిడ్ కలిసి క్రిందికి వస్తాము" అన్నాడు.

మా అమ్మకు అతడంటే భయమెందుకో నాకు తెలియదు. అతడు అలా అనగానే పెగోటీతోసహా క్రిందికి దిగి వెళ్ళిపోయింది.

వాళ్ళు గదినుండి బైటికి వెళ్ళగానే, మర్డ్‌స్టోన్ లోనుండి గది తలుపులకు గడియ పెట్టాడు. తర్వాత నన్ను మంచంమీది నుండి లేవదీసి నేలమీద నిల్చుండ బెట్టాడు. నా దగ్గరగా ఓ కుర్చీ వేసుకుని కూర్చున్నాడు. నాకేమీ అర్థంగాక, బిత్తర పోతూ అతడి ముఖం వంక చూడసాగేను.

"చూడు డేవిడ్!— తలబిరుసుగా ప్రవర్తించే గుర్రంకాని, కుక్కగాని నా దగ్గర ఉంటే, నేను వాటియెడల ఎలా ప్రవర్తిస్తానో నీకు తెలుసా?" అన్నాడు మర్డ్‌స్టోన్.

"నాకు తెలియదు!" అన్నాను.

"నేను చెబుతాను విను! నాకు లొంగక మారాంచేసే వాటిని కొడతాను. రక్తం వచ్చేటట్టు కొట్టి నా స్వాధీనంలోకి తెచ్చుకుంటాను. అది నా పద్ధతి!.... అది సరే నీ ముఖం ఏమిటి అంత అసహ్యంగా ఉంది—" అన్నాడు మర్డ్‌స్టోన్.

"మట్టి పట్టింది!" అన్నాను నిర్లక్ష్యంగా.

నా బుగ్గలమీద నేను ఏడ్చిన కన్నీటిచారలు అసహ్యంగా ఏర్పడ్డాయని అతడికి తెలిసికూడా అదే ప్రశ్నను ఇరవైసార్లు అడిగాడు. అడిగినప్పుడల్లా అదే సమాధానం చెప్పాను. సమాధానం చెప్పినప్పుడల్లా నా చెంపను ఛెళ్ళుమని కొట్టడం ప్రారంభించాడు. నా బుగ్గలు ఎర్రగా కందిపోయాయి. అతడు నన్ను ఆ గదిలో వదిలేసి వెళ్ళిపోయాడు.

ఆ మధ్యాహ్నం అతడి చెల్లెలు మిస్ మర్డ్‌స్టోన్ మా ఇంటికి వచ్చింది.

ఆమెకూడా అన్నలాగే, నా కళ్ళకు అసహ్యంగా కనిపించింది. ఆమె వచ్చింది మా అమ్మకు ఇంటిపనుల్లో సహాయం చేయడానికట!....

"నువ్వు అనారోగ్యంగా ఉన్నావు. నువ్వు ఎక్కడికీ తిరగకుండా సోఫాలో కూర్చో!....అంతే! నీకు కావలసిందల్లా నీ కాళ్ళదగ్గర కొస్తుంది" అని



డేవిడ్ సవతి తండ్రి అతడు తనని చూడటానికి రాలేదన్న కోపంతో డేవిడ్ చెంప పగులగొట్టుట.

మిస్ మర్డ్‌స్టోన్ మా అమ్మతో చెప్పి ఆమె వద్దనున్న తాళాలగుత్తి తీసుకుంది.

ఇక నా విద్యాభ్యాసం ఎలా ప్రారంభం కావాలన్నది ఇంట్లో ఓ సమస్యగా మారింది. నన్ను బోర్డింగ్‌స్కూల్లో వేయాలా? లేక ప్రైవేటుగా చదివించాలా?

అనేది నిర్ధారణ కాలేదు.

అప్పటికి నేను పుస్తకాలు చదవటం అలవాటు చేసుకున్నాను. నన్ను వీధిలోకి వెళ్ళనిచ్చేవారుకాదు. అందువల్ల నాకు స్నేహితులెవ్వరూ లేరు. ఇక నాకు ఇంటిలోని పుస్తకాలే స్నేహితులు. మా నాన్న ఎన్నో పుస్తకాలు సేకరించాడు. అవి చదువుతూ కాలక్షేపం చేసేవాడిని.



పాఠం అప్పగించలేదన్న నెపంతో మర్డ్‌స్టోన్ డేవిడ్‌ని గదిలోకి తీసుకు వెళ్ళి కొడుతుండగా బాధ భరించలేని డేవిడ్ అతడి చేతిని బలంగా కొరుకుతు!

టామ్‌జోన్స్, ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్, డాన్ క్విక్సోట్ చదువుతుంటే నాకెంతో హాయిగా ఆనందంగా ఉండేది. స్కూలుకు సంబంధించిన పుస్తకాలు

ఇంటివద్ద మిస్టర్ మర్డ్‌స్టోన్ నాకు బోధిస్తూ ఉండేవాడు. అంతేతప్ప నన్ను స్కూలుకు వెళ్ళనిచ్చేవాడుకాదు.

ఒకరోజున నేను స్కూలు పుస్తకాలు తీసుకుని హాలులోకి వచ్చాను. అక్కడ అందరూ ఉన్నారు. మిస్ పెగోటీ తలుపువద్దర నిలబడి వుంది. మా అమ్మ నావంక జాలిగా చూడసాగింది. మిస్ మర్డ్‌స్టోన్ నావంక అదోలా చూస్తున్నది. మిస్టర్ మర్డ్‌స్టోన్ చేతిలో పేముబెత్తం వున్నది. అతడు దానిని గాలిలో అటు యిటు ఝుళిపిస్తున్నాడు.

"ఇలారా డేవిడ్!.... ఈరోజు నేను నీ చదువు ఎలా సాగుతున్నదో పరీక్షించాలనుకుంటున్నాను. నేను అడిగే ప్రశ్నలకు సరిగ్గా సమాధానాలు చెప్పక పోయావో నీతాట వొలిచేస్తాను. జాగ్రత్త!" అన్నాడు మర్డ్‌స్టోన్.

నా గుండెల్లో రాయి పడింది. భయమనేది నరనరాలనుపట్టి పీడించడం ప్రారంభించింది. అతడు ఏమి అడుగుతున్నాడో నేనేమి సమాధానం చెబుతున్నానో అంతా అయోమయంగా ఉంది నాకు!—

మరుక్షణం అతడు నా చేయి పుచ్చుకుని గబగబా మేడమీదికి లాక్కుంటూ తీసుకువెళ్ళాడు. క్రింద మా అమ్మ బిగ్గరగా ఏడుస్తున్న శబ్దం నా చెవులకు వినబడుతూనే వుంది.

అతడు నన్ను, నా గదిలోకి తీసుకువెళ్ళి, తలుపు గడియ పెట్టేసాడు. అంతే! చేతిలోని పేము బెత్తంతో నన్ను గొడ్డును బాదినట్టు బాదగొట్టడం ప్రారంభించాడు.

"మిస్టర్ మర్డ్‌స్టోన్! నన్ను కొట్టవద్దండీ!.... ఇవాళ్టికి నన్ను క్షమించండి! రేపు బాగా చదివి పాఠాలు అప్పజెబుతాను" అంటూ ఏడుస్తూ ప్రాధేయపడ్డాను.

అయినా ఆ మూర్ఖుడు నా మీద జాలి చూపించలేదు. ఆ తర్వాత అతడు, నా జుట్టు పుచ్చుకుని నా తలను అటు యిటు బలంగా ఊపసాగేడు.

ఇక నాలో సహనం నశించింది. అతడి మీద కోపం పెల్లుబికి వచ్చింది. వెంటనే నా రెండు చేతులతోటీ నా జుట్టు పుచ్చుకున్న అతడి చేతిని దొరకపుచ్చుకున్నాను. ఆ చేతిని నా నోటివరకూ తెచ్చి పళ్ళతో చేతిని పట్టుకుని, నా శక్తికొలదీ బలంగా కొరికాను.

అతడు పెద్ద గావుకేక పెట్టాడు. నా నోరంతా రక్తంతో తడిసిపోయింది. ఇంకేముంది!.... అతడు నన్ను ఎత్తి మంచంమీదికి విసిరివేసాడు. కాళ్ళతో తన్నుతూ,

చేతిలోని బెత్తంతో కొడుతూ పశువులా ప్రవర్తించాడు. చివరకు అలసిపోయాడు. నేను స్పృహతప్పిపోయాను. అతడు నా గది తలుపులకు బైట నుండి తాళంవేసి వెళ్ళిపోయాడు.



అయిదు రోజులపాటు డేవిడ్‌ని గదిలోపెట్టి బంధిస్తాడు మర్డ్‌స్టోన్! ఆ రాత్రి పెగోటీ వచ్చి తలుపు కంతలో నుండి, డేవిడ్‌తో మాట్లాడుట!

నేను ఆ గదిలో బందీ అయిపోయాను. ఆ రాత్రి మిస్ మర్డ్‌స్టోన్, నా గదికి రొట్టె, పాలు తెచ్చి యిచ్చి, వెంటనే వెళ్ళిపోయింది. ఆమె నా గదికి తాళం వేయడం మాత్రం మరచిపోలేదు.

నేను ఆ విధంగా అయిదు రోజులు గదిలో బందీగా ఉన్నాను. కాల

కృత్యాలు తీర్చుకునేందుకు మాత్రం బయటికి రానిచ్చేవారు. నా వెంట ఎవరో ఒకరు ఉండేవారు.

అయిదవనాటి రాత్రి, పెగోటీ నా గదితలుపు దగ్గరకు వచ్చి నన్ను పిలిచింది. నేను తలుపు దగ్గరకు వెళ్ళి 'ఏమిటని' అడిగాను.

"చూడు మైడియర్ డేవీ!.... నిన్ను రేపు ఉదయాన్నే లండన్ సమీపంగా ఉండే ఓ బోర్డింగ్ స్కూల్లో చేర్పించడానికి పంపించాలని, మర్డ్‌స్టోన్ నిశ్చయించుకున్నాడు" అని చెప్పింది.

"అలాగే కానీయ్ మిస్ పెగోటీ! అక్కడ ఈ నరకం ఉండదు కదా!" అన్నాను.

మా అమ్మను వదిలి వెళ్ళవలసి వస్తున్నదేనన్న బాధ మాత్రం నన్ను పీడిస్తూనే ఉంది.

"మైడియర్ లిటిల్ డేవీ!.... నన్ను క్షమించు మై బాయ్! నేను నీకు ఎటువంటి సహాయం చేయలేకపోయాను. కానీ ఒక్కటి మాత్రం గుర్తుంచుకో! నిన్ను అధికంగా ప్రేమించేదీ, అనునయించేదీ, నీ కోసం జాలిపడేదీ, నీ శ్రేయోభివృద్ధిని కోరేదీ, నీ తల్లి తర్వాత నేనేనని మాత్రం గుర్తుంచుకో!....వస్తాను."

ఆ తర్వాత పెగోటీ మాటలు వినిపించలేదు!

ఆ మర్నాడు ఉదయాన్నే మిస్ మర్డ్‌స్టోన్ వచ్చి తలుపు తీసి, నన్ను క్రిందికి తీసుకు వెళ్ళింది.

స్నానం చేసాను. మంచి బట్టలు వేసుకున్నాను. నా సామానులు గుర్రపు బగ్గీలో ఉంచారు. అదే బండి!.... మమ్మల్ని యార్‌మౌత్ తీసుకువెళ్ళిన బండి అదే!....

వెళ్ళేముందు, మా అమ్మవద్ద సెలవు తీసుకున్నాను. ఆమె నన్ను బిగియారా కౌగలించుకుని ఏడ్చింది.

"చూడు డేవీ! ఈ తల్లిని అపార్థం చేసుకోకు నాయనా! నిన్ను నా దగ్గరే ఉంచుకుని కళ్ళారా చూసుకునే భాగ్యం నాకు లేదు. ఇలా నిన్ను దూరంగా పంపించడం, నీ శ్రేయస్సు కోసమేనని గ్రహించు!- నువ్వు సెలవులకు తప్పక ఇంటికిరా! అప్పుడు నువ్వు మంచిబాలుడిగా మారాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను." అంది మా అమ్మ.

నేను వెళ్ళి బండిలో కూర్చున్నాను. గుర్రపుబగ్గీతోలే వ్యక్తి నాకు సుపరి

చితుడే! అతడి పేరు 'బార్కిన్'! నేను పెగోటీ కనిపిస్తుందేమోనని అటుయిటు చూసాను. కానీ ఆమె ఎక్కడా కనిపించలేదు.

మా బండి దారివెంట కొంతదూరం వెళ్ళింది. అక్కడ బండి ఆగింది. బండి దేనికి ఆగిందోనని బైటికి తొంగి చూసాను.



డేవిడ్‌ని గుర్రపుబండి మీద బోర్డింగ్ స్కూలుకు పంపిస్తారు. దారిలో బండిని ఆపి పెగోటీ అతడికి రొట్టెనూ, డబ్బున్న పర్సునూ యిచ్చుట.

అదే సమయంలో పెగోటే బండివద్దకొచ్చి తలుపు తీసుకుని లోనికివచ్చి, నా ప్రక్కన కూర్చుంది.

నేను పెగోటీ ముఖం వంక చూసాను. ఆమె కళ్ళల్లో నీరు కనిపించింది.

వెంటనే ఆమె తన రెండు చేతులతోటీ నన్ను తన హృదయానికి హత్తుకుంది. ఎంత గట్టిగా హత్తుకున్నదంటే నాకు ఊపిరి ఆడడమే కష్టమైపోయింది. ఆమెనోటి వెంట మాటలు రావడంలేదు. భారంగా నిట్టూరుస్తున్నది.

చివరకు కౌగిలివదిలి తన దగ్గరున్న ఖరీదైన పెద్దరొట్టెను నా కోటుజేబులో ఉంచింది. ఆ తర్వాత ఒక పర్సును నా చేతికిచ్చింది. తర్వాత నా నుదుటిమీద ముద్దు పెట్టుకుని తలుపుతీసి క్రిందికిదిగి వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోయింది.

తిరిగి బండి బయలుదేరింది. నేను పర్సు తెరిచి చూసాను. అందులో మూడు షిల్లింగులు ఉన్నాయి. పర్సులోనే ఓ కాగితానికి చుట్టబడిన బంగారునాణేలు కొన్ని ఉన్నాయి. కాగితం మీద మా అమ్మ దస్తూరి ఉంది—

'నా ప్రియమైన డేవిడ్‌కి ప్రేమతో' అని రాసి ఉంది. కాగితం విప్పి చూసాను. బంగారు నాణేలు ధగ ధగ మెరుస్తూ కనిపించాయి.

మా గుర్రపు బండి మధ్యాహ్నం ఒంటిగంటకు యార్‌మౌత్ చేరింది. మిస్టర్ బార్కిస్ నన్ను హోటల్‌కు తీసుకువెళ్ళాడు. మేమిద్దరం అక్కడ భోజనం చేసాము. తిరిగి మూడు గంటలకు మా బండి బయలుదేరింది ఆ మధ్యాహ్నం రాత్రి మా బండి ప్రయాణం చేస్తూనే ఉంది.

నేను హాయిగా బండిలో పడుకుని నిద్రపోయాను. మర్నాటి ఉదయం ఎనిమిది గంటలకు మా బండి లండన్ చేరుకుంది.

నా రాకకోసం అక్కడ ఓ యువకుడు ఎదురుచూస్తూ నిలుచున్నాడు.

"మిస్టర్ డేవిడ్! నువ్వు చేరబోయే స్కూలులో నేనొక టీచర్ని! నా పేరు 'మెల్' నువ్వు వస్తున్నట్టు, నిన్ను యిక్కడ కలుసుకుని స్కూలుకు తీసుకు వెళ్ళవలసిందిగా మిస్టర్ మర్డ్‌స్టోన్ వర్తమానం పంపించారు." అన్నాడు మిస్టర్ మెల్.

అతడు నన్ను స్కూలు ఉన్న ప్రాంతానికి తీసుకొచ్చాడు. నా కొత్త స్కూలును 'సాలెమ్‌హౌస్' అని వ్యవహరిస్తారు.

స్కూలు చాలా పాతది. గోడలు శిథిలావస్థలో ఉన్నాయి. అక్కడ విద్యార్థులెవరూ లేరు. ఆ విషయమే మిస్టర్‌మెల్‌ని అడిగాను.

"ఇప్పుడు స్కూలుకి సెలవు రోజులు!.... అయితే మిస్టర్ మర్డ్‌స్టోన్. ఈ సెలవుల్లో నిన్నిక్కడికి దేనికి పంపించాడో తెలుసా? ఇంటివద్ద క్రమశిక్షణతో ఉండని వాళ్ళనూ, దురుసుగా ప్రవర్తించే వాళ్ళనూ, సెలవు దినాలలో ఇక్కడికి పంపిస్తారు. అటువంటి పిల్లలకు అది జైలు శిక్షవంటిదే!.... ఇది నీకు శిక్ష!" అన్నాడు

మిస్టర్ మెల్.

మిస్టర్ మెల్ నన్నొక క్లాసురూమ్‌లోనికి తీసుకువెళ్ళాడు. అక్కడున్న ఓ బల్లమీద చెక్కముక్క ఒకటి పడివుంది. దానిమీద ఏవో అక్షరాలు రాసి వున్నాయి. అవి ఏమిటా అనుకుని వాటి వంక పరీక్షగా చూశాను.



స్కూలుకు చేరుకున్న డేవిడ్‌కి జూనియర్ టీచర్ మిస్టర్ మెల్ స్కూలు గదులు చూపించుట.

ఆ చెక్కమీద పెద్ద అక్షరాలతో యిలా రాసి వుంది.

"జాగ్రత్త!.....ఇతడు కరుస్తాడు!"

అది చదివిన తర్వాత నాకు ఎక్కడలేని భయం పట్టుకుంది. గదిలో

ఎక్కడైనా కుక్క ఉన్నదేమోనని అదిరిపడి చప్పున ఓ బల్ల ఎక్కి కూర్చుండి పోయాను.

"ఏమైంది కాఫర్‌ఫీల్డ్?" అని మిస్టర్ మెల్ ఆశ్చర్యంగా అడిగాడు.

నేను చెక్కముక్క వంక చూపిస్తూ "నాకు కుక్కలంటే భయం" అన్నాను.



మర్డ్‌స్టోన్‌ను కరిచినందుకు శిక్షగా డేవిడ్ వీపుమీద చెక్కముక్కను కట్టి దానిమీద 'జాగ్రత్త! ఇతడు కరుస్తాడు!' అని రాయుట !

మిస్టర్ మెల్ బాధపడుతూ "ఆ చెక్కమీద రాసింది కుక్కగురించి కాదు. నీ గురించే! ఆ చెక్కను నీ వీపుకి కట్టమని ప్రిన్సిపాల్‌గారు నన్ను ఆజ్ఞాపించారు.

అందుకు నేను చాలా విచారిస్తున్నాను....మైడియర్ బాయ్!" అన్నాడు.

ఆ తర్వాత మిస్టర్ మెల్ ఆ చెక్కముక్కను తీసుకుని తాడుతో దానిని నా నడుముకు బిగించి కట్టాడు. ఓ సైనికుడు తన కాన్వాసుసంచిని నడుముకు బిగించి కట్టుకున్నట్టు ఉన్నదా చెక్కముక్క.



స్కూలు ప్రిన్సిపాల్ క్రాకల్ ముందుకు తీసుకురాబడిన డేవిడ్ చెవిని మెలిపెడుతున్న క్రాకల్ !

'జాగ్రత్త! ఇతడు కరుస్తాడు!' అని వున్న బోర్డును నా వీపుకు కట్టమనీ, తోటి విద్యార్థులలో అవమానం పొందాలనీ, అందరూ నన్ను గేలిచేయాలనీ యిలా చేసింది మిస్టర్ మర్డ్‌స్టోనేనని నాకు బాగా తెలుసు.

కానీ ఏం చేయగలను?....కొన్నిరోజులకు సెలవులు అయిపోతాయి. పిల్లలందరూ తిరిగి స్కూలుకు వస్తారు. నా వీపుమీద కట్టబడివున్న చెక్కను చూస్తారు. విరగబడి నవ్వుకుంటారు; అంతకన్నా అవమానం మరొకటి ఉంటుందా?

స్కూలులో బల్లలు శుభ్రం చేయడం, ఆవరణ, గదులు ఊడ్చడం అన్ని పనులు నాచేత చేయించేవారు. రాత్రుళ్ళు ఏకాంతంగా గడపవలసి వచ్చేది. అమ్మ జ్ఞాపకంవచ్చి ఏడుస్తూ కూర్చునేవాడిని.

మిస్టర్ మెల్ చాలా మంచివాడు. తీరిక వేళల్లో నాచేత పాఠాలు చదివించే వాడు. తెలియని విషయాలను చక్కగా బోధించేవాడు. అటువంటప్పుడు అతడు వీసమెత్తుకూడా విసుక్కునేవాడుకాదు. నా యెడల ఎప్పుడూ కఠినంగా వ్యవహరించే వాడుకాదు.

ఈ లోకంలో మా అమ్మ, మిస్ పెగోటీయే గాకుండా ఇంకా కొంతమంది మంచివాళ్ళు ఉంటారన్న నమ్మకం కలిగింది నాకు.

## 2

"ఈ ఇంటి స్వంతదారుడూ, ఈ స్కూలుకు ప్రిన్సిపాల్ అయిన మిస్టర్ క్రాకల్ యీ సాయంత్రం ఇంటికి తిరిగి వస్తున్నాడు. అతడు చాలా క్రూర స్వభావం కలవాడు. జాగ్రత్తగా వ్యవహరించాలి సుమా!" అన్నాడు నాతో మిస్టర్ మెల్.

ఆ సాయంత్రం క్రాకల్ వచ్చాడు. నన్ను తీసుకువెళ్ళి అతడిముందు నిలుచుండబెట్టారు.

అతడు నన్ను ఎగాదిగా చూసి "ఓహో! ఈ కుర్రవాడేనా మిస్టర్ మర్డ్‌స్టోన్‌ని కరిచింది?....అయితే ఇతగాడి పళ్ళను తప్పకుండా అరగదీయ వలసిందే!...." అన్నాడు.

నేను క్రాకల్ ముఖం వంక చూస్తూ నిలుచున్నాను! అతడు నెమ్మదిగా లేచి నా వద్దకొచ్చాడు. వ్రేళ్ళతో నా చెవి పుచ్చుకుని, గట్టిగా మెలిపెట్టడం ప్రారంభించాడు.

ఆ తర్వాత యిలా అన్నాడు :

"నీ రెండవ తండ్రి, మర్డ్‌స్టోన్ నాకు బాగా తెలుసు. నేను అతడికి బాగా తెలుసు. నేను ఎటువంటి వ్యక్తినో నీకు తెలుసా?" అన్నాడు క్రాకెల్ నా చెవి మెలి పెడుతూనే.

ఆ బాధను లోలోన దిగమింగుకుంటూ "మీరు ఎటువంటి వారో, నాకింకా

తెలియదు సార్!.... ముందు ముందు తెలుసుకుంటాను" అన్నాను.

క్రాకల్ నా చెవి యింకా గట్టిగా మెలిపెడుతూ "ఎంత పొగరు నీకు!.... నేను ఎటువంటివాడినో ముందు ముందు తెలుసుకుంటావా?....నేను ఎటువంటివాడినో చెబుతాను విను!....నేను ఏది చేయాలని నిశ్చయించుకుంటానో, అది చేసి తీరుతాను. ఇకముందు నేను ఎటువంటి వ్యక్తినో తెలుసుకుంటావు. ఎవరక్కడ? ఈ కుక్క వెధ




స్కూలు తెరిచారు. పిల్లలు వచ్చారు. వాళ్ళ నాయకుడు స్టేర్‌ఫోర్త్
చెబుతున్న మాటలను వింటూ ఉంటారు!

వని తీసుకువెళ్ళండి!" అన్నాడు చెవిని వదిలేస్తూ.

కర్ర కాలు తొడుక్కున్న వ్యక్తి ఒకడు వచ్చి నన్ను తీసుకు వెళ్ళ

బోయాడు.

అప్పుడు నేను క్రాకల్‌తో "సార్! మీరు దయతలచి...." అని ఏదో చెప్ప బోయాను.

తక్షణం అతడు నా వేపు తీక్షణంగా చూసాడు. ఆ చూపు నన్ను భస్మం చేస్తుందా! అన్నంత భయంకరంగా ఉంది.

"సార్! మీరు దయతలచి నా వెనుక వ్రేళ్ళాడదీయబడిన చెక్కను తీసే యిస్తే చాలా కృతజ్ఞుడనై ఉంటాను. విద్యార్థులు స్కూలుకు రాకముందే తీసేయిస్తే మీ మేలు మరువను" అన్నాను జాలిగా ముఖంపెట్టి.

అతడు అమాంతం కుర్చీలో నుంచి పైకి లేచాడు. సింహం లేడిపిల్లమీదికి దూకినట్టు, నా మీదికి దూకబోయాడు. నేను పరిస్థితిని అర్థం చేసుకున్నాను. తక్షణం బాణంలా దూసుకుంటూ, నా గదికి వచ్చి మంచంమీద పడిపోయాను!....

ఆ మర్నాడు మిస్టర్ షార్ప్ అనే టీచర్ వచ్చాడు. అతడు మా స్కూలుకు మొదటి టీచరుట! రెండవ టీచర్ మెల్!.... షార్ప్, ప్రిన్సిపాల్ క్రాకల్‌తో వాళ్ళ ఇంటిలో భోజనం చేస్తాడట. మిస్టర్ మెల్ మాత్రం స్కూలు పిల్లలతోపాటు కూర్చుని భోజనం చేస్తాడట!.... అంటే, షార్ప్‌కి ప్రిన్సిపాల్ వద్ద పలుకుబడి ఎక్కువని ఆ తర్వాత తెలిసింది నాకు.

స్కూలు తెరిచే రోజు వచ్చింది. మొట్టమొదటగా ఓ విద్యార్థి స్కూలుకు చేరుకున్నాడు. ఆ కుర్రవాడి పేరు 'టామీట్రాడెల్స్'!.... ఆ తర్వాత విద్యార్థులు ఒక్కొక్కరే స్కూలుకు రావడం ప్రారంభించారు. అందరూ నా వీపుమీద వున్న చెక్కను చూసి నవ్వుకునేవారు.

అయితే విద్యార్థులంతా, ఒకే ఒక్క విద్యార్థి కోసం ఎదురుతెన్నులు చూడ సాగేరు. బహుశా ఆ కుర్రవాడు స్కూలు విద్యార్థులందరికీ 'లీడర్ కాబోలు' అను కున్నాను.

చివరకు ఆ విద్యార్థి స్కూలుకు వచ్చాడు. అతడి పేరు స్టీర్‌ఫోర్త్ అని తెలుసుకున్నాను.

కుర్రవాళ్ళు నన్ను తీసుకువెళ్ళి స్టీర్‌ఫోర్త్ ముందు నిలుచుండబెట్టారు. 'ఒక దోషిని, మేజిస్ట్రేట్ ముందు నిలుచుండబెట్టినట్టు' అనిపించింది నాకు.

అతడు నా వీపుమీద వున్న చెక్కను చూసి "ఇలా ఎందుకు కట్టారు?" అని ప్రశ్నించాడు.

నేను విషయమంతా స్టీర్‌ఫోర్త్‌తో చెప్పేసాను.

"ఇది చాలా సిగ్గు పడవలసిన విషయం! .... ప్రిన్సిపాల్‌తో చెప్పి దీనిని తీసేయించాలి." అన్నాడు స్టీర్‌ఫోర్త్.

నాకు అతడిమీద గౌరవం కలిగింది. అతడు నా వద్ద వున్న డబ్బును



డేవిడ్ తల్లి చనిపోయిందని వచ్చిన ఉత్తరాన్ని ప్రిన్సిపాల్ భార్య, డేవిడ్‌కి చూపించుట!

అడిగినప్పుడు యివ్వకుండా ఉండలేక పోయాను. ఆ రాత్రి మేమిద్దరం ఆ డబ్బుతో మహారాజ భోజనం చేసాము. అతడు నాకు అత్యంత ఆప్త మిత్రుడయ్యాడు.

రోజులు గడుస్తున్నాయి. చదువు సక్రమంగానే సాగుతున్నది.

ఒకరోజు సాయంత్రం నన్ను చూసేందుకు మిస్ పెగోటీ వచ్చింది. ఆమె వెంట హామ్ కూడా వచ్చాడు. నేను ఎంతో సంతోషించాను. వారిని నా స్నేహితుడైన స్టీర్‌ఫోర్తుకు పరిచయం చేసాను.

"మనం ఎప్పుడైనా సరే ఒక్కసారి యార్‌మౌత్ వెళ్ళాలి!" అన్నాడు నా మిత్రుడు.



డేవిడ్ తల్లి కర్మకాండ జరిపేందుకు అందరూ స్మశాన వాటికకు వచ్చుట!

"అలాగే! తప్పకుండా వెళదాం!" అని చెప్పాను.

ఆ తర్వాత పెగోటీ హామ్ మావద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

అర్థసంవత్సరం పరీక్షలు అయ్యాయి.... సంవత్సర పరీక్షలు దగ్గర పడు

తున్నాయి. పట్టుదలతో శ్రద్ధగా చదువుతున్నాను. సెలవులకు ఇంటికి వెళ్ళాలి. అమ్మను తనివిదీరా చూడాలి. అని రోజూ ఏవో తీయని ఊహలతో తేలిపోతూ ఉండేవాడిని....

ఒకనాడు మిసెస్ క్రాకల్ వద్దనుండి కబురు వచ్చింది. నేను ఆమె వద్దకు వెళ్ళాను.

"కూర్చో నాయనా డేవిడ్! నువ్వు చాలా చిన్న కుర్రవాడివి ఈ వయసులో నీకింత పెద్ద కష్టం రావడం భరింపరాని విషయమే! అయినా ఏం చేస్తాం! భరించక తప్పదు కదా!...." అంది ఆమె.

నాకు ఏమీ అర్థం కాలేదు ఆమె చేతిలో ఓ విప్పిన కవరూ కాగితమూ ఉన్నాయి ఆ ఉత్తరం నాకు వచ్చి వుంటుందని భావించాను.

"ఏం జరిగింది మేడమ్?....వివరంగా చెప్పండి?" అన్నాను.

"ఏం చెప్పను! మీ అమ్మ చనిపోయినట్టు ఉత్తరం వచ్చింది!" అంది మిసెస్ క్రాకల్.

మా అమ్మ నాకికలేదు అనే విషయం గుర్తుకురాగానే దుఃఖ భారంతో నా శరీరం యావత్తూ కంపించిపోయింది. ఒక్కసారే పెద్ద పెట్టున బిగ్గరగా ఏడ్చేసాను. నా ఏడుపుతో సేలమ్‌హౌస్ మార్మోగి పోయింది.

'నేనిక అనాథను! నా కెవ్వరూ లేరు!' అని అరుస్తూ పరిగెత్తుకుంటూ నా గదికి వెళ్ళాను. మంచం మీదపడి ఎంతసేపు ఏడ్చానో ఆ దైవానికే తెలియాలి.

ఆ మర్నాడు ఇంటికి ప్రయాణమయ్యాను. తిరిగి స్కూలుకు వస్తానన్న నమ్మకం లేదు.

తలుపుగంట కొట్టగానే పెగోటీ వచ్చి తలుపు తెరిచింది. ఆమెను చూడగానే దుఃఖం పెల్లుబికి వచ్చింది. అమాంతం ఆమెను కౌగలించుకుని వెక్కి వెక్కి ఏడ్చాను.

పెగోటీ నన్ను సందిట పొదివి పుచ్చుకుని "మైడియర్ పూర్‌బాయ్!.... ఈ వయసులో నీ కెంత కష్టం వచ్చింది నాయనా! .... నేను వున్నాను కదా! నీకు ఏ కష్టం రానీయను ధైర్యం వహించు" అని ఓదార్చింది.

ఇంట్లో అడుగు పెట్టాను. మిస్టర్ మర్డ్‌స్టోన్ సోఫాలో కూర్చుని ఉన్నాడు. నేను వచ్చినట్టు గ్రహించాడు. అయితే కన్నెత్తి కూడా నా వంక చూడలేదు. ఏదో పుస్తకం చదువుతున్నట్టు అభినయించసాగాడు.

మిస్ మర్డ్‌స్టోన్ మాత్రం నన్ను పరామర్శ చేసింది.

"ఇక నువ్వు స్కూలుకు వెళ్ళే అవకాశం ఉండకపోవచ్చును. స్కూలు నుండి నీ పుస్తకాలు, బట్టల పెట్టె, తెచ్చుకున్నావా?" అని అడిగింది.

మా అమ్మకు కర్మకాండ జరుపడానికి అందరం కలిసి శ్మశానవాటికకు



పెగోటీ, డేవిడ్‌ని యార్‌మౌత్ తీసుకువెళ్ళిన తర్వాత బండీతోలే బార్కిస్‌ని ఆమె వివాహం చేసుకొనుట !

వెళ్ళాము. అక్కడ మిస్టర్ మర్డ్‌స్టోన్‌కానీ అతడి చెల్లెలు మిస్ మర్డ్‌స్టోన్‌కానీ దుఃఖించలేదు.

మిస్ పెగోటీ మాత్రం చంటిపిల్లలా ఏడ్చింది. నా సంగతి వేరే చెప్పేదేముంది!—

3

ఒకరోజున మిస్ మర్డ్‌స్టోన్ పెగోటీని ఉద్యోగంనుండి తీసివేసింది. పెగోటీ నాకోసం ఆ ఇంటిలో పనిచేస్తున్నదికానీ లేకపోతే మా అమ్మ చనిపోయిన వెంటనే పనిమానుకుని వెళ్ళిపోయి వుండేది.

ఇప్పుడు కాకపోయినా ఇంకొకరోజునైనా సరే, ఆ ఇంటిలోనుండి నాకు గూడ ఉద్వాసన జరుగుతుందని నాకు తెలుసు.

పెగోటీ యార్‌మౌత్ వెళ్ళాలని నిశ్చయించుకుంది. అదేరోజున నేను స్కూలుకు లండన్ వెళతానని మిస్టర్ మర్డ్‌స్టోన్‌కు చెప్పాను.

"నువ్వు స్కూలుకు వెళ్ళవలసిన అవసరంలేదు. ఇంట్లోనే పనీపాటా చూసుకుంటూ ఉండు—" అన్నాడు.

"కొన్నాళ్ళు డేవిడ్ నా దగ్గరే ఉంటాడు. యార్‌మౌత్ తీసుకువెళతాను" అంది పెగోటీ మర్డ్‌స్టోన్‌తో.

దానికి అతడు అంగీకరించాడు. నేను సంతోషంగా పెగోటీ వెంట యార్ మౌత్ చేరుకున్నాను. మమ్మల్ని బార్కిస్ తన బండిలో తీసుకొచ్చాడు.

అక్కడ మాకు మిస్టర్ పెగోటీ హామ్ స్వాగతం చెప్పారు. యార్‌మౌత్ లోని మిస్టర్ పెగోటీ యిల్లు ఏం మారలేదు. ఎమిలీ మాత్రం కొద్దిగా పెరిగింది. అందంగా వుంది.

బార్కిస్, మిస్ పెగోటీ ఒకరోజున తాము వివాహం చేసుకుంటున్నట్టు ప్రకటించారు. అందరం ఎంతో సంతోషించాము. వాళ్ళకు చర్చిలో వివాహమైన తర్వాత బార్కిస్ తన భార్యనూ, నన్నూ తన ఇంటికి తీసుకువెళ్ళాడు.

పెగోటీ నాకొక గది చూపించి "మైడియర్ డేవీ! ఇది నీ గది! నేను బ్రతికి ఉండగా ఎప్పటికీ ఈ గది నీదే!....నువ్వు పెద్దవాడివైన తర్వాత నువ్వు చైనాలో ఉన్నా, దూరదేశంలో ఎక్కడున్నా ఈ గది నీకోసం అలా ఖాళీగానే ఉంటుంది. నీమీద నాకున్న ప్రేమానురాగాలు శాశ్వతంగా ఉండిపోతాయి...." అంది.

పెగోటీకి నామీద వున్న అనురాగానికి, వాత్సల్యానికి నేను ఎంతగానో ఆనందించాను. అక్కడున్న పదిహేనురోజులూ పదిహేను సెకన్లుగా గడిచి పోయాయి.

ఒకరోజున బార్కిస్ బండి తీసుకొచ్చాడు. పెగోటీ నేనూ బండిలో కూర్చున్నాము. బండి మా ఇంటికొచ్చింది. పెగోటీ నన్ను ముద్దుపెట్టుకుని ఇంటి

ముందు నన్ను దిగవిడిచింది. ఆమె ఇంటిలో పలికిగూడ రాలేదు.

"భగవంతుడు దయామయుడు మైడియర్ డేవీ! నిన్ను చల్లగా చూస్తాడు" అంది పెగోటీ.

ఆ తర్వాత వాళ్ళ బండి ముందుకు సాగిపోయింది. నేను ఒంటరిగా ఇంటి ముందు నిలబడిపోయాను. ఏం చేయాలో తోచలేదు. ప్రపంచమంతా శూన్యమని పించింది.

"ఈ ఇంట్లో ఎవరున్నారు నాకు?....ఇకముందు నా భవిష్యత్తు ఎలా ఉంటుంది?....నాకు దిక్కెవ్వరు?" ఇవే ఆలోచనలు నన్ను వేధించసాగాయి.

నేను ఇంట్లో అడుగుపెట్టాను. మిస్ మర్డుస్టోన్, మిస్టర్ మర్డుస్టోన్ నన్ను చూసారు. నేను ఇంటికి వచ్చిన సంతోషంకానీ బాధకానీ వారి ముఖాలలో కనిపించ లేదు. నేను ఆ ఇంటిలో ఒక వ్యక్తినన్న భావమే వాళ్ళల్లో కనిపించలేదు.

వేళకు టీ యివ్వడం. భోజనం పెట్టడం విషయాలలో ఎటువంటి లోపంకానీ ఛీదరించుకోవడంకానీ నాకు ఎదురుకాలేదు. నన్ను బయటికి వెళ్ళనిచ్చేవారుకాదు. ఇంటిలోనే ఉండేవాడిని. ఏ పనీ చేయనిచ్చేవారుకాదు. ఆప్యాయంగా పలుకరించే వారుకాదు. ఏదో నిర్లిప్తత, నిరాశా నన్ను ఆవరించుకున్నాయి. దానికన్నా జైలు జీవితమే నయమనిపించింది.

ఆ విధంగా రోజులూ, వారాలూ, నెలలూ గడిచిపోసాగేయి.

'నాకు జబ్బు చేస్తే నేను మంచం మీద నుండి లేవలేకపోతే నా దగ్గర కూర్చుని నాకు సపర్యలు చేసే వారెవ్వరు? అప్పుడు నా గతి ఏమిటి?' అని బాధ పడేవాడిని.

కనీసం నన్ను పొరుగింటికి గూడ వెళ్ళనిచ్చేవారు కాదు. నేను స్నేహితు లను ఏర్పరచుకోవడం వారికి ఇష్టం ఉండేది కాదు. ఇంటి విషయాలు, నా స్నేహితు లకు చెబుతానన్న భయం వాళ్ళకు!

నాకు పెగోటీని చూడాలనిపించేది. కాని వాళ్ళు వెళ్ళనిచ్చే వారుకాదు. అయితే పెగోటీ మాత్రం నన్ను చూసేందుకు వారానికి ఒక్కసారి అయినా మా ఇంటికి వచ్చేది. అప్పుడు నా కోసం ఏదో ఒకటి తెచ్చేది.

ఒకనాడు మర్డ్‌స్టోన్ ఇంటిలోలేని సమయంలో అలా షికారుగా బయటికి వెళ్ళాను. తిరిగి ఇంటికి వచ్చేసరికి మర్డ్‌స్టోన్ తన స్నేహితుడైన మిస్టర్ క్వినైన్‌తో మాట్లాడుతూ కనిపించాడు. అతడు నాకు తెలుసు.

"ఏం చదువుతున్నావ్ డేవిడ్!" అని క్వినైన్ అడిగాడు.

నేను ముభావంగా ఉండిపోయి మర్డ్‌స్టోన్ ముఖం వంక చూసాను.

"చదువు మానేసాడు. ఇంట్లోనే ఖాళీగా ఉంటున్నాడు. సోమరిపోతులాగ తయారవుతున్నాడు." అంటూ ఛీవరించుకున్నాడు మర్డ్‌స్టోన్.



డేవిడ్‌ని వదిలించుకునేందుకు మర్డ్‌స్టోన్ తన స్నేహితుడితోబాటు లండన్‌లోని కర్మాగారంలో పని చేయడానికి పంపించుట

క్వినైన్ ఆ రాత్రి మా ఇంటిలోనే బస చేసాడు. రాత్రి చాలా పొద్దుపోయే వరకు వాళ్ళు ఏవో మాట్లాడుకున్నారు.

ఉదయాన్నే మర్డ్‌స్టోన్ నన్ను హాలులోకి పిలిపించి యిలా అన్నాడు.

"చూడు డేవిడ్! నువ్వు పెద్దవాడివవుతున్నావు. నీ వంటి పిల్లలు పనీ పాటా లేకుండా మరొకరి మీద ఆధారపడి బ్రతకడం మంచిది కాదు. నీ భవిష్యత్తు ఏమిటో నీవే నిర్ణయించుకోవడం అందరికీ శ్రేయస్కరమైన విషయం!.... నేను ధన వంతుడను కాదు. నువ్వు కొద్దోగొప్పో చదువుకున్నావు. నీ భవిష్యత్తును ఏర్పరుచు



డేవిడ్‌కి భోజనవసతి ఏర్పాటు చేయబడిన మిస్టర్ మికాబర్ అనేవాడిని అప్పులు ఎక్కువకాగా పోలీసులు వచ్చి అతడ్ని తీసుకువెళ్ళుట!

కోడానికి ఆ చదువు సరిపోతుంది. ఈ విశాల ప్రపంచంలో వెదికితే ఏదో ఒక పని దొరక్కపోదు. అంత శ్రమ దేనికి? మిస్టర్ క్వినైన్‌కు లండన్‌లో చిన్న కర్మాగారం ఉంది. అందులో నీ వయసు పిల్లలు చాలామంది పని చేస్తున్నారు. నువ్వు ఆ కర్మా

గారంలో పనికిచేరు. నీకు కొంత డబ్బు వస్తుంది. అది నీ భోజనానికి ఖర్చులకు సరి పోతుంది. ఇల్లు అదీ నేను చూస్తాను. దాని అద్దె నేను కడతాను. తక్షణం క్విన్లైన్ వెంట బయలుదేరు. నీ కొత్త జీవితాన్ని ప్రారంభించు."

నన్ను వదిలించుకోవటానికి పెద్ద ఉపన్యాసమే యిచ్చాడు మిస్టర్ మర్డ్‌స్టోన్.

నేను శాశ్వతంగా మా ఇంటిని విడిచిపెట్టాను. క్విన్లైన్ వెంట లండన్‌కు బయలుదేరాను. అప్పటికి నా వయసు పది సంవత్సరాలు!

## 4

క్విన్లైన్ నడుపుతున్న కర్మాగారం చాలా చిన్నది. అక్కడ నలుగురైదు గురు కుర్రవాళ్ళు మాత్రమే పని చేస్తున్నారు. అందరూ నా వయసు వాళ్ళే!

దానిని కర్మాగారం అనేకన్నా పాడుబడిన చిన్న ఇల్లు అనడం బాగుం టుంది. ఆ ఇంటిలో మా కన్నా ఎక్కువగా ఎలుకలూ పందికొక్కులూ సంచరిస్తూ ఉంటాయి.

అక్కడ మేము చేసేపని.... బ్రాందీ సీసాలకు లేబిల్స్ అంటించడం, కార్కులు బిగించడం అట్టపెట్టెలలో పెట్టి ప్యాకింగ్ చేయడం!....

ఆ రోజు మధ్యాహ్నం మిస్టర్ క్విన్లైన్, నన్ను తన వద్దకు పిలిపించాడు. వెళ్ళాను!.... అక్కడ లావుగా నడి వయసులో ఉన్న ఓ వ్యక్తి కూర్చుని ఉన్నాడు.

"చూడు డేవిడ్! ఇతని పేరు 'మికాబర్'! ఇతను మిస్టర్ మర్డ్‌స్టోన్‌కి బాగా పరిచయమున్నవాడు. నువ్వు ఇతని ఇంటిలో ఉండటానికి" మర్డ్‌స్టోన్ ఏర్పాటు చేసాడు.

"నేను తిరిగి రాత్రి ఎనిమిది గంటలకు వచ్చి నిన్ను ఇంటికి తీసుకు వెళ తాను" అని చెప్పి మికాబర్ వెళ్ళిపోయాడు.

మిస్టర్ క్విన్లైస్, నా మొదటి వారం జీతం ఆరు షిల్లింగులను ఆ రోజే నాకు అడ్వాన్సుగా యిచ్చాడు. అందులో నుండి ఆరు పెన్నీలను కర్మాగారంలోని కుర్రవాడికిచ్చి, రాత్రికి నా పెట్టెను మికాబర్ ఇంటికి తీసుకు వచ్చేందుకు ఏర్పాటు చేసుకున్నాను.

అంతా సవ్యంగానే ఉంది. కర్మాగారంలో పని చేస్తున్నాను. వారం వారం జీతం తీసుకుంటున్నాను. తిండికీ, ఖర్చులకూ అది సరిపోతున్నది.

మికాబర్ దంపతులు చాలా మంచివాళ్ళు. నన్ను వాళ్ళ కుటుంబ సభ్యుడి

మాదిరిగానే చూసుకుంటున్నారు.

అయితే కొద్ది రోజులు గడిచిన తర్వాత నాకు తెలిసిన యదార్థ విషయం ఏమిటంటే— మికాబర్‌కి నగరం నిండా బోలెడు అప్పులున్నాయని!....

ఒకనాడు అప్పుల వాళ్ళంతా మికాబర్ మీద కోర్టులో దావా వేసారు. జడ్జి



డేవిడ్ చివరకు తన మేనత్త దగ్గరకు వెళ్ళిపోదామని నిశ్చయించుకుంటాడు. ఆమె అడ్రసు తెలియజేయమంటూ, పెగోటీకి ఉత్తరం వ్రాయుట!—

గారు యిచ్చిన తీర్పు ప్రకారం మికాబర్‌ని ఖైదులో వేసారు. పాపం! అతడి భార్య నా ముందు ఒకటే ఏడుపు.

కొన్ని రోజులు గడిచిన తర్వాత, మికాబర్, జైలు నుంచి 'ఇన్‌సాల్వెంట్ పిటీషన్' కోర్టువారికి పంపుకున్నాడు.

కొద్ది రోజుల తర్వాత అతడు పెట్టుకున్న పిటీషన్ అంగీకరింపబడింది. మిస్టర్ మికాబర్ జైలు నుండి విడుదల చేయబడ్డాడు.

నా దురదృష్టమో ఏమో కానీ, మికాబర్ కుటుంబాన్ని తీసుకుని, లండన్ వదిలి 'యార్‌మౌత్'కి వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాడు.

నాకు నెత్తిమీద పిడుగు పడినంత పనైంది!.... వాళ్ళు వెళ్ళిపోతే, నాకు వసతి ఎలాగ? ఎవరి వద్ద ఉండను!....

"చూడు డేవిడ్!.... మేము వెళ్ళిపోతున్నాము. మళ్ళీ నీకు వసతి ఎక్కడ కుదురుతుందో తెలియదు. ఇంత చిన్నవయసులోనే నీకు కష్టపరంపరలు ఎదురవుతున్నాయి. ఎలా నిలదొక్కుకుంటావో ఏమో!" అంటూ మిసెస్ మికాబర్ ఎంతో బాధపడింది.

నాకు అంతా అయోమయంగానూ, శూన్యంగానూ తోచింది. అయితే ఆ శూన్యంలో ఒకే ఒక్క వ్యక్తి ఆశాజ్యోతిలా కనిపించింది.

ఆ వ్యక్తి ఎవరో కాదు; మా మేనత్త 'మిస్ బెట్సీట్రాట్‌వుడ్'! అయితే ఏం లాభం? ఆమె ఎక్కడ నివసిస్తున్నదో, అసలు బ్రతికి ఉందో లేదో, ఏ విషయాలూ నాకు తెలియవు.

బహుశా, పెగోట్టీకి తెలిసి ఉండవచ్చునన్న భావంతో ఆమెకు ఓ ఉత్తరం రాసాను.

అందులో నా పరిస్థితి వివరిస్తూ: మా మేనత్త దగ్గరకు వెళ్దామనుకుంటున్నాననీ, ఆమె ఎక్కడ ఉందో వివరాలు రాయమనీ, ఖర్చులకు కొంత డబ్బు పంపితే చాలా సంతోషిస్తాననీ తెలియబరిచాను.

నాలుగు రోజులు పోయిన తర్వాత, పెగోటీ వద్దనుండి ఉత్తరం వచ్చింది. అందులో, అర్ధ గినీ బంగారు నాణెం ఉంది- నా సంతోషం ఏమని చెప్పను?

ఆమె రాసిన ఉత్తరంలో యిలా ఉంది :

"మైడియర్ డేవీ! నీ నిర్ణయం చాలా బాగుంది. ప్రస్తుత పరిస్థితులలో, నువ్వు మీ మేనత్త దగ్గరకు వెళ్ళడమే శ్రేయస్కరం!– అయితే ఆమె పూర్తి చిరునామా నాకు తెలియదు. ఆమె డోవర్ ప్రాంతంలో నివసిస్తున్నట్టు మాత్రం నాకు తెలుసు. ఆమె డోవర్‌లోని 'హీత్' ప్రాంతంలో కానీ, శాండ్‌గేట్ లేదా ఫోక్‌స్టోన్‌లో గానీ తప్పక ఉంటుంది. డోవర్‌కి వెళ్ళి ప్రయత్నించు."

మా కర్మాగారం వద్ద నాకు పరిచయమున్న ఓ పెద్దమనిషిని అడిగాను.

"డోవర్‌లో నువ్వు చెప్పిన ప్రదేశాలన్నీ ఒకేచోట ఉన్నాయి" అని చెప్పాడు.

నేను డోవర్‌కి వెళ్ళడానికే నిశ్చయించుకున్నాను!— వారం చివరి రోజున జీతం అందింది. మధ్యాహ్నం భోజనం చేసి, నేను ఉంటున్న ఇంటికి వెళ్ళాను.



తన మేనత్త దగ్గరకు వెళ్ళేందుకు, డేవిడ్ తన లగేజీని, డోవర్ కోచ్ ఆఫీసు వరకూ తీసుకు వెళ్ళేందుకు ఓ గాడిద బండిని కుదుర్చుకొనుట.

అక్కడ నా పెట్టె ఉంది. అది చాలా బరువుగా ఉంటుంది. నేను ఒక్కడినే ఆ పెట్టెను తీసుకురాలేను. ఎవరైనా కూలివాడు కనిపిస్తాడేమోనని చుట్టుప్రక్కల వెదికాను.

ఆ పెట్టెను డోవర్ కోచ్ బుకింగ్ ఆఫీసులో ఉంచి, ఒక్కడినే ప్రయాణీకుల కోచ్‌లో, డోవర్ వెళదామనీ, మా మేనత్త కనిపించిన తర్వాత వచ్చి పెట్టెను తీసుకు వెళ్ళవచ్చుననీ నిశ్చయించుకున్నాను.

అంతలో సన్నగా, పొడవుగా ఉన్న ఓ వ్యక్తి గాడిద కట్టబడిన ఓ బండిని తోలుకుంటూ అటుగా వచ్చాడు.

నేను వాడిని ఆపి, "నా పెట్టెను డోవర్ కోచ్ ఆఫీసుకు తీసుకు వస్తావా?" అని అడిగాను.

"వస్తాను!" అన్నాడు.

కిరాయి, ఖరారు చేసుకున్నాను. వాడూ, నేనూ కలిసి, పెట్టెను నెమ్మదిగా మేడ నుంచి క్రిందికి దించి బండిలో పెట్టాము.

వాడి చూపు, వాలకం, మాటతీరు నాకైతే నచ్చలేదు. కానీ ఏం చేయను? పెట్టె తెచ్చేందుకు నాకు మరొక వ్యక్తి దొరకలేదు.

బండి బయలుదేరింది. నేను పెట్టెమీద కూర్చున్నాను. వాడు నా ప్రక్కన కూర్చుని, గాడిదను కర్రతో కొట్టడం ప్రారంభించాడు. అది దెబ్బలకు తట్టుకోలేక, దారివెంట వేగంగా పరిగెత్తడం ప్రారంభించింది. అది గతుకుల రోడ్డు కావడంవల్ల నేనూ, నా పెట్టె, వాడు ఎగిరెగిరి పడసాగేము. దానితో నా చొక్కా జేబులో వున్న ఆఫ్ గినీ బంగారు నాణెం పైకి ఎగిరి బండిలో పడి ఖంగున మోగింది.

ఆ బంగారు నాణేన్ని వాడు ఇంతింత కళ్ళు చేసుకుని చూసాడు. నేను చప్పున, బండిలో పడిన నాణేన్ని తీసుకుని, జాగ్రత్త కోసం నోటిలో పెట్టుకున్నాను.

మరుక్షణం వాడు తక్కున బండిని ఆపుజేసి, పిడికిలి బిగించి, నా గెడ్డం క్రింద బలంగా గుద్దాడు. ఆ దెబ్బకు నా నోరు తెరుచుకుని, బంగారు నాణెం యివతలికి వచ్చి పడింది. వాడు తక్షణం దానిని అంది పుచ్చుకున్నాడు.

"ఏయ్! ఆ నాణెం నాకివ్వు!" అన్నాను బిత్తరపోతూ.

"ఇది నీ నాణెమా! ఎక్కడ దొంగిలించావు దీనిని! ఈ పెట్టె కూడా దొంగిలించిందే కదూ!.... పద పోలీస్ స్టేషన్‌కి! నీవంటి దొంగవెధవల్ని చాలామందిని పోలీసులకు అప్పగించాను. నడు పోలీస్ స్టేషన్‌కి!" అంటూ వాడు బండి దిగి, నన్ను క్రిందికి లాగడం ప్రారంభించాడు.

నేను సహాయం కోసం అటు యిటు చూసాను. కానీ ఏం లాభం?....ఆ దారి వెంట ఒక్కరూ రావడం కనిపించలేదు.

వాడి చేతిలో నేనెంత?.... వాడు బలవంతాన నన్ను నేలమీదికి యీడ్చి అమాంతం ఎగిరి బండి మీద కూర్చున్నాడు.

గాడిదను అదిలిస్తూ "నేను పోలీసు స్టేషన్‌కి వెళుతున్నాను. పోలీసులు వచ్చేవరకు అక్కడే ఉండు!" అని పెద్దగా నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.



బండివాడు డేవిడ్‌ని మోసం చేసి, కుర్రవాడిని నేల[illegible]దికి లాగేసి, సామానుతో సహా బండిని తోలుకుంటూ వె[illegible]ళ్ళిపోవుట!

నేను అమాంతం లేచి, బండి వెంట పరిగెత్తడం ప్రా[illegible]భించాను. లండ[illegible] వీధుల్లో, జనసమ్మర్థం మధ్యనుండి ఏడుస్తూ, అరుస్తూ [illegible] రిగెత్తాను. బండి కనుచూ[illegible] మేర నుండి దాటిపోయే వరకు అలా పరిగెత్తుతూనే [illegible]న్నాను.

'ఏమిటి అలా పరిగెత్తుతున్నావ్? ఏం జరిగింది?' అని ఏ ఒక్క వ్యక్తి నన్ను ప్రశ్నించలేదు. చివరకు ఒకచోట నిలబడి బిగ్గరగా ఏడ్చేసాను.

'నా సర్వస్వం' అనుకున్న పెట్టె పోయింది. బట్టలు పోయాయి. విలువైన, నా బంగారు నాణేలు పోయాయి. డోవర్ వెళ్ళేందుకు కావలసిన ఛార్జీ డబ్బులు నా దగ్గరలేవు. ఏడవడం తప్ప నా వయసులో వున్న పిల్లలు ఏం చేయగలరు?....



సర్వస్వం పోగొట్టుకున్న డేవిడ్ డోవర్‌కి కాలినడకన బయలుదేరి చీకటి పడే సమయానికి దారిప్రక్కగా వున్న గడ్డివాము వద్ద నిద్రపోవుట!

తిరిగి క్వినైన్ కర్మాగారానికి వెళ్ళడం నాకు యిష్టంలేదు. అక్కడ కూర్చుని దీర్ఘంగా ఆలోచించాను.

'ఈ రోడ్ తిన్నగా డోవర్‌కి వెళుతుంది. మనిషికి పట్టుదల అనేది ఉండాలి కానీ, కాలినడకన ప్రపంచం యావత్తూ చుట్టిరావచ్చు. కొంత కష్టపడాలికానీ కాలి నడకన కొద్ది రోజులకైనా డోవర్ చేరుకోలేనా?.... మా మేనత్త కనిపించాలే కాని యీ కష్టాలను మరచిపోవడం ఎంతసేపు!' అనుకున్నాను.

నా దగ్గర మూడు ఆఫ్ పెన్నీలు మాత్రమే ఉన్నాయి. నేను వేసుకున్న చిన్న కోటును ఓ దుకాణంలో అమ్మితే షాపువాడు తొమ్మిది పెన్నీలు యిచ్చాడు. ఆ తర్వాత నా జాకెట్ అమ్మేసాను. ఇక నా శరీరం మీద చొక్కా, ఫ్యాంటు మాత్రమే వున్నాయి. చేతిలో వున్న ఆ కొద్ది డబ్బు దారి ఖర్చులకు సరిపోతాయని నిశ్చయించుకుని, డోవర్ నగరం దిక్కుగా నడక సాగించాను.

చీకటి పడే సమయానికి ఓ నిర్జన ప్రదేశానికి చేరుకున్నాను. అక్కడ అన్నీ పంటపొలాలే!....ఏదైనా అడుగుదామన్నా ఒక్క మనిషి కూడా కనిపించ లేదు. సమీపంగా ఏదైనా గ్రామం వున్న జాడ కూడా కనిపించలేదు. కటికచీకటిలో అడుగు ముందుకు పడలేదు.

అటుయిటు చూసాను. ఒకచోట దారిప్రక్కగా పెద్ద గడ్డివామి కనిపించింది. తిన్నగా దాని దగ్గరకు వెళ్ళి చలిబారిపడకుండా కొంత ఎండు గడ్డిని మీద కప్పుకుని, హాయిగా నిద్రపోయాను.

తెల్లవారిన తర్వాత, తిరిగి ప్రయాణం సాగించాను. ఆకలిగా వున్నప్పుడు చిన్న రొట్టెను కొనుక్కోవటంగాని తింటూ ప్రయాణం సాగించడం, రాత్రివేళ, ఎక్కడో నేలమీదపడి నిద్రపోవడం....

రోజులు గడుస్తున్నాయి. నా కాలినడక అలాసాగుతూనే వుంది. కొన్ని రోజులకు నా వద్ద వున్న డబ్బు ఖర్చు అయిపోయింది.

కొన్ని రోజుల నుండీ స్నానం చేయకపోవడం వల్ల శరీరమంతా మట్టి కొట్టుకుపోయి అసహ్యంగా తయారైంది. చొక్కా, ప్యాంటు దుమ్ము, ధూళితో, చెమటతో నిండి, కంపు కొట్టసాగేయి. తైల సంస్కారం లేని జుట్టు కొబ్బరిపీచులా మారిపోయింది.

ఎలాగైతేనేమి కొన్ని రోజులు శ్రమపడి ఎన్నో మైళ్ళు ప్రయాణం చేసి, చివరకు డోవర్ నగరం చేరుకున్నాను.

ఉదయం నుండీ మధ్యాహ్నం వరకూ మా మేనత్త చిరునామా కనిపించిన వారినల్లా అడుగుతూ కాలం గడిపాను. అయినా ఆమెను తెలిసినవారు ఎవ్వరూ నాకు

తారసపడలేదు.

మధ్యాహ్నం అయ్యేసరికి, కడుపులో ఎలుకలు పరిగెత్తడం ప్రారంభించాయి. ఎక్కడైనా కూర్చుని, కొన్ని క్షణాలు, విశ్రాంతి తీసుకోవాలనిపించి అటుయిటు చూసాను. రోడ్డు ప్రక్కగా ఓ దుకాణం మూసేసి వుంది. నెమ్మదిగా వెళ్ళి అక్కడున్న మెట్ల దగ్గర కూర్చున్నాను.



కాలినడకన డోవర్ వచ్చిన డేవిడ్ నీరసంతో ఒక షాపు ముందున్న మెట్లమీద కూర్చుని వుండుట!

అంతలో ఓ గుర్రపు బండి అటుగా వచ్చింది. బండి తోలుతున్నవాడి చేతి నుండి ఓ వస్తువు జారి క్రిందపడింది. అది బండివాడు చూసుకోలేదు. నేను గబ గబా వెళ్ళి ఆ వస్తువును తీసుకుని, పరిగెత్తుకుంటూ బండిదగ్గరకు వెళ్ళి, దానిని బండి

వాటికి అందజేసాను.

"ఎవరు బాబూ నువ్వు? ఈ నగరం వాడివి కానట్టుందే ఎక్కడనుండి వచ్చావు? ఎక్కడికి వెళ్ళాలి?" అని బండివాడు నన్ను ప్రేమగా అడిగాడు.

నేను నా విషయం చెప్పాను మా మేనత్త పేరు చెప్పి "ఆమె మీకు తెలుసా?" అని అడిగాను అమాయకంగా.



గుర్రపు బండివాడు యిచ్చిన పెన్నీ నాణెంతో డేవిడ్ హోటల్ కి వెళ్ళి ఆవురావురుమంటూ రొట్టె కొనుక్కొని తినుట!

"మిస్ బెట్ సేట్రాట్ వుడ్!....అవునవును ఆమె నాకు తెలుసు నిష్కర్షగా ముక్కుకు సూటిగా పోయేమనిషి అసలు నవ్వు అనేదే ఆ ముసలిదాని ముఖంలో కనిపించదు." అన్నాడు బండివాడు.

అవునని తల ఆడించాను!

"అయితే ఈ రోడ్డువెంబడే తిన్నగా వెళ్ళు. కొంతదూరం వెళ్ళిన తర్వాత నీకు కొన్ని ఇళ్ళు కనిపిస్తాయి. ఆ ఇళ్ళ ముఖద్వారాలన్నీ సముద్రం దిక్కుగా వుంటాయి. అక్కడే ఉంటున్నది నువ్వుచెప్పే బెట్ సేట్రాట్ వుడ్!...." అని చెప్పి బండివాడు నా చేతిలో ఒక పెన్నీ పెట్టి తనదారిన వెళ్ళిపోయాడు.

ఆ పెన్నీనాకెం నా కంటికి పెన్నిధిలాగ కనిపించింది. గబగబా ఓ దుకాణంవద్దకు వెళ్ళి రొట్టె కొనుక్కున్నాను. దాన్ని నములుతూ బండివాడు చూపించిన మార్గం వెంట బయలుదేరాను.

చాలాదూరం నడిచిన తర్వాత బండివాడు చెప్పిన ఇళ్ళదగ్గరకు వచ్చాను. అక్కడొక చిన్న దుకాణం వుంది. దుకాణందారుడివద్దకు వెళ్ళి మా మేనత్త పేరు చెప్పి చిరునామా అడిగాను.

ఆ దుకాణంలో సరుకులు కొంటున్న ఓ యువతి నావేపు పరీక్షగా చూస్తూ "చూడు బాబూ! నువ్వు చెబుతున్న మిస్ ట్రాట్ వుడ్ నా యజమానురాలు. నేను ఆమెవద్ద పనిచేస్తున్నాను. ఇంతకీ ఆమెతో నీకు పనేమిటి?" అని అడిగింది.

"ఆమెతో మాట్లాడుదామని వచ్చాను."

"ఓహో!....ఏదయినా సహాయం అడగటానికి వచ్చావన్నమాట!" అంటూ ఆమె తను కొన్న సరుకులను ఓ సంచిలో వేసుకుని "నా వెంట బయలుదేరు!" అని చెప్పి ముందుకు దారితీసింది.

నేను ఆమెను అనుసరించాను!

కొంతసేపటికి ఆమె ఓ ఇంటివద్దకొచ్చి "ఇదే మిస్ బెట్ సేట్రాట్ వుడ్ ఇల్లు!" అని చెప్పి గబగబా లోనికి వెళ్ళిపోయింది.

ఆ ఇల్లు చాలా అందంగా తీర్చిదిద్దినట్టు వుంది. ఇంటిముందు చిన్న పూల తోట వుంది. నేను నెమ్మదిగా లోనికివెళ్ళి ఇంటిముందు నిలుచున్నాను.

అప్పటి నా దుస్తులు, అవతారం అచ్చుముచ్చు భిక్షగాడికంటె కడు హీనంగా వుంది. 'మా మేనత్తను నేను ఎన్నడూ చూడలేదు. ఆమెను ఎలా పలకరించాలి? నన్ను నేను ఏ విధంగా పరిచయం చేసుకోవాలా?' అని ఆలోచించసాగేను.

అంతలో హొడవుగావున్న ఓ నడివయసు వృద్ధురాలు తలుపు తెరుచుకుని యివతలికి వచ్చింది. ఆమె చేతిలో హొడవాటి కత్తి వుంది. దానితో పూలతోటలోని

చెట్టుకొమ్మలను నరుకుతారనుకుంటాను.

ఆమె ఎదురుగావున్న నన్ను చూస్తూనే ఛీదరించుకుంటూ "ఎవర్రా నువ్వు? వెళ్ళు! వెళ్ళు!" అంటూ కత్తిని గాలిలో ఊపుతూ అంది.

"దయచూపించండి మేడమ్!" అన్నాను.



చివరకు డేవిడ్ మేనత్త ఇంటికొచ్చి ఇంటిముందు నిలబడి ఉంటే అతడి మేనత్త ఎవడో భిక్షగాడు అనుకొని 'పొమ్మని' కసురుకొనుట!

"మగపిల్లలంటే నాకు అసహ్యం. వాళ్ళు కనిపిస్తే నేను ఊరుకోను. తక్షణం బయటికిపో!" అంది ఆమె కళ్ళెర్రజేస్తూ.

ఆమె తప్పకుండా నా మేనత్తేనని నిర్ధారణ చేసుకున్నాను.

"దయచేసి నామీద కనికరం చూపించు ఆంటీ!" అన్నాను దీనంగా.

ఆమె ముఖంలో ఎటువంటి ఆశ్చర్యమూ కనిపించలేదు నాకు! ముఖం చిట్లించుకుని అసహ్యంగా నావేపు చూసింది.

"దయచూపించు ఆంటీ! నేను నీ మేనల్లుణ్ని!" అన్నాను.

"ఓరి భగవంతుడా!" అంటూ మా మేనత్త అక్కడే మెట్టుమీద చతికిలబడి పోయింది.

"నిజమే చెబుతున్నాను ఆంటీ! నేను నీ సోదరుడి కొడుకును. నాపేరు డేవిడ్ కాపర్ ఫీల్డ్! నేను పుట్టినరోజున నువ్వు మా అమ్మను చూడటానికి మా ఇంటికి వచ్చావుకదూ! మా అమ్మ చనిపోయింది ఆంటీ! అప్పటినుండి నేను పడని కష్టాలంటూ లేవు. నన్ను చదువుకోనివ్వలేదు. నా శక్తికిమించిన పనులు చేయించారు. బాధలు భరించలేక నిన్ను వెదుక్కుంటూ యిలా వచ్చాను. నా పెట్టెనూ, నా దగ్గరవున్న డబ్బునూ ఓ దొంగవెధవ మోసంచేసి అపహరించుకుపోయాడు. చేసేదిలేక లండన్‌నుంచి ఇక్కడికి కాలినడకన వచ్చాను. తిండికిలేక అల్లాడిపోయాను. రాత్రుళ్ళు కటికనేలమీద నిద్రపోయాను" అని చెబుతూ దుఃఖాన్ని ఆపుకోలేక బిగ్గరగా ఏడ్చేశాను.

కఠినాత్మురాలైన మా మేనత్త హృదయంలో ఏ మూలనో జాలి, దయ, కరుణ ఉన్నట్టున్నాయి.... అవి ఆ క్షణంలో జాగృతమయ్యాయి! అనుకుంటాను–

ఆమె కూర్చున్నచోటు నుండి ఒక్కుదుటున లేచింది. గబగబా నావద్ద కొచ్చింది. నా చేయి పుచ్చుకుని చకచకా ఇంటి లోపలికి తీసుకుపోయింది. నన్ను ఓ సోఫాలో కూర్చోబెట్టి, నా తల వెనుకగా సోఫామీద ఒక శాలువా కప్పింది. నా కాళ్ళ కింద పెద్ద గుడ్డ వేసింది. నా శరీరానికి, తలకూ ఉన్న మట్టివల్ల సోఫా, నేల మీద వున్న తివాసీ పాడవకుండా ఉండటానికి అలా చేసిందని భావించాను.

మా మేనత్త గంట వాయించింది. తక్షణం ఆమె సేవకురాలు వచ్చింది. ఆమె నన్ను దుకాణం దగ్గర నుండి యింటికి తీసుకొచ్చింది.

"చూడు జానెట్! మిస్టర్ డిక్‌ని తక్షణం క్రిందికి రమ్మని చెప్పు!"

మిస్టర్ డిక్ ఆ ఇంటిలో మగ నౌకరు!.... జానెట్ వెళ్ళి డిక్‌ని పిలుచుకు వచ్చింది.

"చూడు డిక్!.... సోదరుడు డేవిడ్ గురించి తరుచూ చెబుతుండే దానిని గుర్తుందా? ఆ సోదరుని కుమారుడు ఈ కుర్రవాడు. ఇతడి పేరు డేవిడ్ కాపర్‌ఫీల్డ్!

ఈ క్షణం నుండీ ఇతడి మంచిచెడ్డలు చూసే బాధ్యత నీదే!...." అంది మా మేనత్త.

మిస్టర్ డిక్ తక్షణం నన్ను స్నానాల గదికి తీసుకువెళ్ళి వేడినీళ్ళతో స్నానం చేయించాడు. తన బట్టలు నాకు కట్టిబెట్టాడు.



డేవిడ్ కష్టాలు తొలగిపోయి అతడి మేనత్త అతడిని ఆదరిస్తుంది.
నౌకరు చేత డేవిడ్‌కి స్నానం చేయించుట

ఆ తర్వాత వేడివేడి భోజనం వడ్డించబడింది. అంత విలువైన, రుచికరమైన భోజనం నా జన్మలో తినలేదు.

తర్వాత డిక్ నన్ను మేడమీద గదిలోకి తీసుకువెళ్ళి నా పడకగదిని చూపించాడు. మంచం మీద మేనువాల్చిన వెంటనే గాఢమైన నిద్ర పట్టేసింది.

## 5

“నిన్ను చదివించాలనుకుంటున్నాను. నీ ఉద్దేశమేమిటి” అడిగింది మా మేనత్త.

నేను ఎంతో సంతోషిస్తూ “చదువుకుంటాను!” అని చెప్పాను.

మా మేనత్త నాసామాను సర్దింది. మేముబయలుదేరి కాంటర్‌బర్రీ వచ్చాము. అక్కడ మా మేనత్తకు తెలిసిన ఒక వ్యక్తి ఉన్నాడు. అతడి పేరు ‘విక్‌ఫీల్డ్’ నన్ను అతడికి అప్పగించింది.

నా వసతి అతడి ఇంటిలో ఏర్పాటు చేసింది. విక్‌ఫీల్డ్ నన్ను ఓ స్కూలులో జాయిన్ చేసాడు. ఆ తర్వాత మా మేనత్త తిరిగి డోవర్ నగరానికి వెళ్ళిపోయింది.

మిస్టర్ విక్‌ఫీల్డ్ నన్నెంతో ఆదరంగా చూసేవాడు. అతడికి భార్యలేదు. ఒక కుమార్తె మాత్రం ఉంది. ఆమెది ఇంచుమించు నా వయసే!.... ఆ పిల్లపేరు ‘ఆగ్నేస్’!.... ఇంటి పనులూ తండ్రి మంచి చెడ్డలు ఆమే చూసుకునేది.

నా స్కూలు జీవితం చక్కగా సాగిపోతున్నది. మా మేనత్త వారానికి ఒకసారి కాంటర్‌బర్రీ వచ్చి, నా చదువు సంధ్యలు ఎలా సాగుతున్నదీ టీచర్లను అడిగి వెళుతుండేది. ఆ తర్వాత నేనే నెలకొకసారి డోవర్ వెళ్ళి మేనత్తను చూసి వస్తుండేవాడిని.

పెగోటీకి తరుచూ ఉత్తరాలు రాస్తుండేవాడిని. ఆమె కూడా నాకు ఉత్తరాలు రాస్తుండేది.

కొంతకాలానికి నా స్కూలు చదువు పూర్తి అయింది. నేను యుక్తవయసుకు వచ్చాను.

“ఇక్కడ ఖాళీగా కూర్చుని ఏం చేస్తావు? నీ చిన్ననాటి సేవకురాలు. పెగోటీ దగ్గరకు వెళ్ళి కొన్నిరోజులు సరదాగా గడిపి రాకూడదూ?” అంది మా మేనత్త ఒకనాడు.

నేను చాలా సంతోషించాను!....

“తిరిగి వచ్చేటప్పుడు లండన్‌లో ఓ గది అద్దెకు తీసుకుని కొన్నాళ్ళు హాయిగా కాలక్షేపం చేసిరా!” అంటూ మా మేనత్త నాకు కొంత డబ్బు యిచ్చింది.

మొట్టమొదటగా నేను కాంటర్‌బర్రీ వెళ్ళాను. కొద్దిరోజులు విక్‌ఫీల్డ్ ఇంటిలో ఉన్నాను. ఆగ్నేస్ పెద్దదైంది. నా రాక ఆమెకు ఎంతో సంతోషాన్ని కలిగించింది.

"నాన్నగారు ఎలా ఉన్నారు ఆగ్నేస్?" అని అడిగాను.

"నాన్నగారి పరిస్థితి ఏమీ బావుండలేదు. అతను రోజంతా తాగుతూనే ఉంటున్నారు. న్యాయవాది అయినా సరిగా కోర్టుకు వెళ్ళడంలేదు. ఇప్పుడు ఒక వ్యక్తిని భాగస్వామిగా పెట్టుకున్నాడు. అతడిని ఇక్కడ నువ్వు చాలాసార్లు



చిన్నప్పుడు తను చదువుకునేందుకు డేవిడ్ మేనత్త అతడిని విక్ ఫీల్డ్
అనే లాయరు ఇంట ఉంచుతుంది. అతడి కూతురు ఆగ్నేస్!....
పెద్దయ్యాక అతడు ఆగ్నేస్ ఇంటికి వచ్చుట!

చూసావు. అతని ఇంటికి నువ్వు టీ తాగటానికి చాలాసార్లు వెళ్ళావు." అంది ఆగ్నేస్.

"ఎవరూ?.... వాడా? 'యూరియాహీప్' సంగతి కదూ నువ్వు చెప్పేది?" అన్నాను.

"అవును! అతడే! ఇప్పుడు కోర్టు వ్యవహారాలన్నీ అతడే చూస్తున్నాడు. నాన్నగారు పూర్తిగా తాగుడుకు బానిస అయిపోయారు. ఇప్పుడు ఈ ఇంటి పెత్తనమంతా యూరియాహీప్‌దే! అతడు నన్ను పెళ్ళి చేసుకునే ఉద్దేశంలో ఉన్నాడనీ నలుగురి ముందూ అలాగే వాగుతున్నాడనీ తెలిసింది." అంటూ ఆగ్నెస్ నా ముఖంలోకి చూసింది.

నేను ఏమీ మాట్లాడలేదు. ఆ తర్వాత మిస్టర్ విక్‌ఫీల్డ్ వద్దా, ఆగ్నెస్ వద్దా సెలవు తీసుకుని లండన్ చేరుకున్నాను.

లండన్‌లో ఓ హోటల్ గది అద్దెకు తీసుకున్నాను. ఒకనాడు రాత్రి నాటకం చూసుకుని తిరిగి హోటల్‌కు వచ్చాను. అక్కడ కాఫీ తాగి నా గదికి బయలుదేరాను. అలా వెళ్తున్న నా దృష్టి సోఫాలో కూర్చున ఓ యువకుడి మీద పడింది. అతడు చాలా అందంగా విలువగల దుస్తులలో కనిపించాడు. అతడ్ని ఎక్కడో చూసిన జ్ఞాపకం నా మనసులో మెదిలింది. చివరకు అతడెవరో జ్ఞాపకం వచ్చింది.

"ఓయ్ స్టేర్‌ఫోర్త్!.... బాగున్నావా?" అన్నాను.

అతడు నా ముఖం వంక ప్రశ్నార్థకంగా చూస్తూ ఉండిపోయాడు.

"నేనూ! నీ చిన్ననాటి స్కూల్ మేట్‌ని! గుర్తు పట్టలేదా?" అన్నాను.

అప్పటికి నేనెవరో అతడికి జ్ఞాపకం వచ్చినట్టుంది. నవ్వుతూ లేచి నిలుచున్నాడు.

"గుర్తు పట్టకపోవడమేమిటి? నువ్వు డేవిడ్ కాపర్‌ఫీల్డ్‌వి కదూ!.... ఎన్నాళ్ళకు చూసాను." అన్నాడు స్టేర్‌ఫోర్త్.

ఇద్దరం తిరిగి సోఫాలో కూర్చున్నాము. చిన్ననాటి సంగతులు ముచ్చటించుకున్నాము. సేలమ్‌హౌస్ విడిచిన తర్వాత జరిగిన సంఘటనలను ఒకరికొకరం చెప్పుకున్నాము.

"నేను ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో చదువుతున్నాను. సెలవులకి అమ్మను చూద్దామని వెళ్ళుతున్నాను. నువ్వు కూడా నాతో మా ఇంటికి రాకూడదూ? మా అమ్మను చూద్దువుగాని! ఎన్నోరోజులు ఉండవద్దులే! ఒకటి రెండు రోజులు ఉండి వెళ్ళిపోవచ్చును–" అన్నాడు స్టేర్‌ఫోర్త్ ప్రేమగా.

దానికి నేను అంగీకరించాను. ఇద్దరం కలిసి వాళ్ళ ఇంటికి వెళ్ళాము.

స్టేర్‌ఫోర్త్ భవనం ఓ కొండ శిఖరంమీద ఉంది. అది చాలా పురాతన భవనం. ఆమె మమ్మల్ని ఆప్యాయంగా ఆహ్వానించింది. తన కొడుకు స్నేహితుడనని నన్ను ఎంతో ఆదరభావంతో చూసింది.

రెండురోజులు గడుపుదామని వచ్చిన నేను వారంరోజులు అక్కడే ఉండి పోయాను. వారం తర్వాత నేను యార్‌మౌత్‌కు బయలుదేరాను.

"చిన్నప్పుడు ఒకసారి నన్ను యార్‌మౌత్ తీసుకు వెళ్తానని వాగ్దానం చేసావు గుర్తుందా?.... నేను కూడా నీ వెంట వస్తాను. పల్లెటూరు వాతావరణం అంటే నాకెంతో యిష్టం!" అన్నాడు స్టేర్‌ఫోర్త్.

మేము ఇద్దరం ట్రెయిన్‌మీద యార్‌మౌత్ చేరుకున్నాము.

"నువ్వు పెగోటీ ఇంటికి వెళ్ళు! .... నేను అన్నీ చూసుకుంటూ కొంత ఆలస్యంగా వచ్చి నిన్ను కలుసుకుంటాను." అని చెప్పి స్టేర్‌ఫోర్త్ మరొక మార్గం గుండా వెళ్ళిపోయాడు.

నేను పెగోటీ ఇంటికి వెళ్ళాను. తలుపు వేసి వుంది. నెమ్మదిగా తలుపు తట్టాను. పెగోటీ వంటగదిలో వున్నట్టుంది. కొంతసేపటికి వచ్చి తలుపు తీసింది.

ఎదురుగా వున్న నన్ను చూసి 'ఏంకావాలి?' అన్నట్టు తల పంకించింది. నేను మందహాసం చేసాను. కానీ ఆమె నన్ను గుర్తు పట్టలేదు. మేము ఆఖరిసారి కలుసుకున్నప్పటికీ ఇప్పటికీ మధ్య వున్న వ్యవధి ఏడు సంవత్సరాలు అప్పటికీ ఇప్పటికీ నాలో చాలా మార్పు వచ్చింది మార్పురావడం సమాజమేకదా!

నేను ఎవరో చెప్పకుండా "మిస్టర్ బార్కిన్ ఇంటిలో ఉన్నారా?" అని అడిగాను.

"అతను మంచంలోనే ఉన్నారు. కొన్నిరోజులుగా కండరాలు, కీళ్ళ నొప్పులతో బాధపడుతున్నారండీ!" అంది పెగోటీ.

"అయితే అతను బ్లండర్‌స్టోన్ వెళ్ళడం లేదన్నమాట!" అన్నాను.

"వెళ్ళడం లేదండీ!....ఖులాసా చిక్కినాక వెళతాడు!" అంది పెగోటీ.

"నువ్వు ఎప్పుడైనా అక్కడికి వెళ్ళావా మిసెస్ బార్కిన్? ఎందుకంటే నిన్నొక ప్రశ్న అడగాలనివుంది." అన్నాను.

"ఏమిటండీ అది?" పెగోటీ సంశయంగా అడిగింది.

"అక్కడొక ఇల్లు వుంది. ఆ ఇంటిలో నువ్వు పూర్వం పనిచేసావు ఆ

ఇంటిలోని మనుషుల గురించి అడగాలని వచ్చాను." అన్నాను.

ఆ మాటతో ఆమె నా ముఖంలోకి పరీక్షగా చూసింది. ఆమె కళ్ళల్లో ఏదో చెప్పలేనంత ఆనందపు వెలుగు కనిపించింది. తక్షణం ఒక్క అడుగు వెనక్కి వేసి చేతులను తొడుక్కున్న గౌనుకు తుడుచుకుంది.



పెద్దవాడైన తర్వాత డేవిడ్, పెగోటీని చూసేందుకు ఆమె ఇంటికి వచ్చుట

"పెగోటీ!" అంటూ ఆనందంతో కేక పెట్టాను.

ఆమె తన రెండు చేతులను ముందుకు చాస్తూ "నా ప్రియమైన డేవీ!.... ఎన్నాళ్ళకు చూసానయ్యా నిన్ను! ఎంత మార్పు వచ్చింది నీలో!" అంటూ నన్ను గాఢంగా కౌగిలించుకుంది.

నేను ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అవుతూ పెగోటీ కౌగిలిలో ఒదిగి పోయాను. మా అమ్మ కౌగిలిలో యిమిడి పోయినంత ఆనందం పొందాను నేను!.... మా ఇద్దరి నయనాలు అశ్రుపూరితాలయ్యాయి.

"లోపలికిరా డేవీ!....నిన్ను చూస్తే బార్కిస్ ఎంతో సంతోషిస్తాడు. మందుల కంటే గూడ నీరాక అతడికి ఎంతో స్వస్థతను చేకూర్చుతుంది." అని చెప్పి పెగోటీ నన్ను బార్కిస్ గదిలోకి తీసుకు వెళ్ళింది.

బార్కిస్ నన్ను చూసి ఎంతో సంతోషించాడు. ఓ అరగంట గడిచిన తర్వాత స్టేర్‌ఫోర్త్ అక్కడికి వచ్చాడు.

మేము కొన్నిరోజులు ఆనందంగా గడిపాము!....

ఒకనాడు మా మేనత్త వద్ద నుండి ఉత్తరం వచ్చింది.

"మనం వెళ్ళిపోవాలి. తక్షణం బయలుదేరి రమ్మని మా మేనత్త ఉత్తరం రాసింది." అని స్టేర్‌ఫోర్త్‌తో చెప్పాను.

లండన్‌కు ఇద్దరికి కోచ్ బండిలో సీట్లు రిజర్వుచేయించి వచ్చాను. అందరి వద్దా సెలవు తీసుకుని, బండిలో లండన్‌కు బయలుదేరాము.

"విషయమేమిటి? అర్జంటుగా రమ్మని మీ మేనత్త ఉత్తరం రాయడానికి కారణమేమిటి?" బండిలో అడిగాడు స్టేర్‌ఫోర్త్.

"మా మేనత్త నా భవిష్యత్తు కోసం ఆరాటపడుతున్నది. నన్ను ఎక్కడైనా ఉద్యోగంలో నియమించి నా అభివృద్ధిని చూడాలని ఆరాటపడుతున్నది."

"నువ్వు ఏం చేయాలని ఆమె ఆరాటపడుతున్నది?"

"నన్ను లాయర్ని చేయాలని ఆమె ఆరాటం!....అందుకని నన్ను ఎక్కడయినా పెద్ద లాయర్లవద్ద జూనియర్‌గా చేర్పించాలని సూచించింది!" అన్నాను.

"మీ మేనత్తది మంచి ఆలోచన!....మరి నీ ఉద్దేశమేమిటి?" అన్నాడు స్టేర్‌ఫోర్త్.

"నాకూ అదే ఆలోచన వుంది!"

"లండన్ వచ్చి ఆ తర్వాత డోవర్ వెళతావా?"

"లేదు. మా మేనత్త నాకోసం వచ్చి లండన్‌లోని ఓ హోటల్‌లో బస చేసింది. హోటల్ పేరు రాసి, అక్కడికివచ్చి తనని కలుసుకోమని రాసింది" అన్నాను.

చివరకు మేము లండన్ చేరుకున్నాము. స్టీర్‌ఫోర్త్ తన ఇంటికి వెళ్ళిపోయాడు. నేను మా మేనత్త బసచేసిన హోటల్‌కి వెళ్ళాను.

గదిలో మా మేనత్త ఒకతె ఉంది. నన్ను చూస్తూనే వచ్చి కౌగలించుకుంది. ఆమె నౌకరు డిక్ ఎప్పుడూ వెంట వుండేవాడు కనిపించలేదు. 'ఖర్చులు తగ్గించుకోవాలి కాబట్టి పనివాళ్ళను మాన్పించేస్తాను' అని ఆమె నాతో ఒకసారి అన్నది.



సీనియర్ లాయర్‌వద్ద జూనియర్‌గా చేరి పని నేర్చుకోమని
డేవిడ్ మేనత్త డేవిడ్‌తో చెప్పుట!

"డిక్‌కి ఉద్వాసన చెప్పేసావా ఆంటీ?" అని అడిగాను.
ఆమె అవునన్నట్టు తల ఆడించింది. భోజనంచేసి కూర్చున్నాము.

"నేను తెలియజేసిన ఉద్యోగం నీకు యిష్టమేనా?" అని అడిగింది.

"ఇష్టమే ఆంటీ!....కాని అందులో ఓ సమస్య వుంది" అన్నాను.

"ఏమిటది?"

"నేను లండన్‌లోనే ఉండవలసి వస్తుంది. నా వసతి భోజనానికి చాలా డబ్బు కావలసి వస్తుందికదా! నేను మరొకరివద్ద జూనియర్‌గా చేరి నేర్చుకునే వరకు నాకు ఆదాయమంటూ ఏదీ రాదుకదా!—అదే ఆలోచిస్తున్నాను" అన్నాను.

"అందుకు వేయి పౌండ్లు ఖర్చుకావచ్చును. అంతేకదా!" అంది మేనత్త.

నేను నివ్వెరపోతూ "వేయి పౌండ్లు అంటే మాటలనుకుంటున్నావా ఆంటీ!....అంత డబ్బు నీ దగ్గరమాత్రం ఎక్కడిది? దీనికోసం నువ్వు బాధలుపడడం నాకు యిష్టంలేదు ఆంటీ!" అన్నాను బాధగా.

ఆమె నవ్వి "మైడియర్ బాయ్!....నేను బ్రతికి ఉన్నది నీకోసమే నాయనా!....నువ్వు అభివృద్ధిలోకి రావడమే నా లక్ష్యం. నీ మంచికోసం నేను ఏదయినా చేస్తాను. నువ్వు నా సోదరుడి కొడుకువుకాదు.... నా బిడ్డవే!....నీ ఆనందమే నా ఆనందం!" అంది. ఆ మధ్యాహ్నం మేనత్త నన్నొక చోటికి తీసుకు వెళ్ళింది. అదొక పెద్ద ఆఫీసు.

మిస్టర్ స్పెన్‌లో మరియు మిస్టర్ జార్‌కిన్స్ ఆ ఆఫీసు యజమానులు. వాళ్ళిద్దరూ పేరుమోసిన లాయర్లు.

మేము వెళ్ళి ఆఫీసులో కూర్చున్న అరగంట తర్వాత మిస్టర్ స్పెన్‌లో, నల్లకోటు భుజంమీద వేసుకుని తిన్నగా కోర్టునుండి ఆఫీసుకు వచ్చాడు.

మా మేనత్త అతనికి తెలుసుననుకుంటాను నవ్వుతూ పలుకరించాడు. ఆమె నన్ను అతనికి పరిచయం చేసింది. వాళ్ళిద్దరూ అన్ని విషయాలు మాట్లాడు కున్నారు.

"మా ఆఫీసులో ఉంటూ నెలరోజులపాటు పనినేర్చుకుంటే మంచిది!" అన్నాడు స్పెన్‌లో.

దానికి నేను సంతోషంగా అంగీకరించాను. అక్కడికి ఉద్యోగ విషయం ఒక విధంగా స్థిరపడినట్టే.

ఇకపోతే, నేను ఎక్కడ వుండాలి? ఏదయినా ఒక ఇల్లు అద్దెకు తీసుకోక తప్పదు.

మేనత్త, నేనూ లండన్ నగరం యావత్తూ గాలించాము. చివరకు బకింగ్ హామ్ వీధిలో ఓ ఇల్లు దొరికింది. ఇల్లు బాగానే వుంది. అందులో ఓ చిన్న హాలు, పడకగది, వంటగది వున్నాయి. ఇంటి ఓనర్‌తో మాట్లాడింది.

"ప్రస్తుతానికి మాకొక నెల మాత్రమే ఇల్లు కావాలి. అవసరమైతే నెల తర్వాత మరొక సంవత్సరానికి తీసుకుంటాము" అని!

ఆ తర్వాత ఆమె నెలకు కావలసిన సరుకులను తెచ్చి యిచ్చింది.

తను తిరిగి డోవర్‌కి వెళ్ళిపోతూ కొంత డబ్బు నా చేతికిచ్చి-

"నీ నిజమైన జీవితం రేపు ఉదయంనుంచి ప్రారంభమవుతుంది. నా సహాయ సహకారాలు నీకు ఎల్లప్పుడూ ఉంటాయి నాయనా! పోతే నీ భవిష్యత్తును తీర్చిదిద్దుకునే అవకాశం నీ చేతిలోనే వుంది. దానికి బలమైన పునాది వేసుకోవడం లోనే నీ ప్రజ్ఞా విశేషాలు ఎక్కువగా ఆధారపడి వుంటాయి. గుర్తుపెట్టుకో!" అని చెప్పింది.

'మా మేనత్త లేకపోతే నేను ఏమై ఉండేవాడిని?— ఇంత చదువు చదివి వుండేవాడినికాదు. ఎక్కడో ఏ కర్మాగారంలోనో కార్మికుడిగా ఉంటూ దుర్భర జీవితం వెళ్ళబుచ్చుతూ ఉండేవాడిని!' అనుకున్నాను.

## 6

రోజులు, వారాలు గడిచిపోతున్నాయి. నేను శిక్షణ కాలాన్ని పూర్తి చేసాను. మిస్టర్ స్పెన్‌లో ఆఫీసులో నాకు ఉద్యోగం దొరికింది. సంవత్సరానికి నాకు తొంభై పౌండ్లు జీతం యిచ్చేటట్టు ఏర్పాటు చేసుకున్నారు.

ఉద్యోగంలో చేరిన వారాంతంలో మిస్టర్ స్పెన్‌లో నన్ను వాళ్ళ ఇంటికి ఆహ్వానించాడు ....వాళ్ళ ఇల్లు 'నార్‌ఉడ్'లో వుంది. మిస్టర్ స్పెన్‌లో నన్ను సాదరంగా ఇంట్లోకి ఆహ్వానించాడు.

"నాకు ఒక్క కుమార్తెతప్ప ఎవరూలేరు డేవిడ్!....వాళ్ళమ్మ చాలాకాలం క్రితమే చనిపోయింది. 'డోరా'ని తల్లీ, తండ్రీ నేనే అయి అల్లారుముద్దుగా పెంచాను. పారిస్‌లో చదువుకుంటూ ఉండేది. చదువు పూర్తిచేసుకుని యీ మధ్యనే ఇంటికి వచ్చింది" అని చెప్పాడు స్పెన్‌లో.

మేము మేడమీది గదిలోకి వెళ్ళాము!.... డోరా మంచంమీద కూర్చుని యింకొక యువతితో మాట్లాడుతున్నది.

"అమ్మా! డోరా! ఇతను డేవిడ్ కాపర్ ఫీల్డ్!.... డేవిడ్....ఈమె నా కుమార్తె డోరా!" అంటూ స్పెన్‌లో పరిచయం చేశాడు.

డోరాను చూశాను. చాలా అందంగా వుంది.

"నేను డేవిడ్ కాపర్ ఫీల్డ్‌ని యింతకుముందే చూసాను" డోరా ప్రక్కన నిలుచున్న యువతి అంది.

నేను ఆమె ముఖంవంక పరీక్షగా చూశాను.

ఆమె ఎవరోకాదు; మిస్ మర్డ్‌స్టోన్!

"ఎలా ఉన్నావు మిస్ మర్డ్‌స్టోన్" అని పలుకరించాను.

"బాగానే ఉన్నాను. నువ్వు బాగున్నావా?" అంది ఆమె.

ఆమె అన్న మిస్టర్ మర్డ్‌స్టోన్ గురించి అడిగాను. బాగానే ఉన్నాడని చెప్పింది. నా తల్లి మరణానికి వాడే కారణమని తెలిసిన నాకు కోపం ముంచు కొచ్చింది. అయినా తమాయించుకున్నాను.

"మీ ఇద్దరికీ ముందే పరిచయముందా?" అని అడిగాడు స్పెన్‌లో.

"కాపర్ ఫీల్డ్ చిన్నతనంలో సంగతి! అప్పుడు మా ఇద్దరికీ కొద్దిగా పరిచయం ఏర్పడింది" అంది మిస్ మర్డ్‌స్టోన్.

"డోరాకు తల్లిలేదు కదా! ఆమెకు స్నేహితురాలిగా రక్షణగా ఉండటానికి మిస్ మర్డ్‌స్టోన్ దయతో అంగీకరించింది" అన్నాడు స్పెన్‌లో.

నేను తిరిగి ఇంటికి వచ్చేసాను.

ఆ మర్నాడు ఉదయాన్నే 'మార్నింగ్ వాక్'కి బయలుదేరాను. దారిలో మిస్టర్ స్పెన్‌లో కుమార్తె డోరా కనిపించింది. ఇద్దరం మాట్లాడుకుంటూ నడక ప్రారంభించాము.

"ఇంత ఉదయాన్నే షికారుగా బయలుదేరారేమిటి?" అని డోరాను అడిగాను.

"ఇంట్లో అలా పనీపాటా లేకుండా కూర్చుని ఉండటం విసుగు అనిపించింది. అదీగాక మిస్ మర్డ్‌స్టోన్ మాటలు విని విని తలబొప్పి కడుతున్నది. లోకంలో తనకు తెలియని విషయమంటూ లేనట్టు వాగుతుంది. అవసరం లేకపోయినా అలా మాట్లాడే వాళ్ళంటే నాకు అసహ్యం. ఆమె ఇంట్లో లేకపోవడం చూసి, యిలా బయటికి వచ్చేసాను." అంది డోరా.

అంతలో మర్డ్‌స్టోన్ డోరాని వెదుక్కుంటూ మేము నిలుచున్న చోటికి వచ్చింది. నా వేపు అదోలా చూసింది.

"పద డోరా! నాన్నగారు నీ కోసం ఎదురు చూస్తున్నారు" అంటూ డోరాను తీసుకుని వెనుదిరిగి బయలుదేరింది.



తన సీనియర్ లాయర్ కూతురు డోరాని డేవిడ్ ప్రేమించుట

డోరా నన్ను కూడా ఇంటికి రమ్మని కోరింది. నేను వాళ్ళవెంట బయలుదేరాను.

డోరా నన్ను ఒక్క క్షణం కూడా విడిచి ఉండలేదు. ఆ రోజు అంతా నేను అక్కడే ఉండిపోయాను. కబుర్లు చెప్పుకుంటూ మధ్యాహ్నం భోజనాలు చేసాము.

ఎవరైనా కొత్తవారు చూస్తే డోరా, నేనూ భార్యాభర్తలమనే భావిస్తారు. డోరా మనసులో ఆ ఉద్దేశం ఉందేమో నాకు తెలియదు.

రోజులు గడుస్తున్నాయి! ఒకనాడు స్టేర్‌ఫోర్తు నా దగ్గరకు వచ్చాడు.

"నేను నిన్ననే యార్‌మౌత్ నుండి వచ్చాను. నీకు యివ్వమని పెగోటీ ఉత్తరం రాసి యిచ్చింది" అంటూ స్టేర్‌ఫోర్తు నాకొక ఉత్తరం యిచ్చాడు.

బార్కిస్ ఆరోగ్యం బాగా చెడిపోయిందనీ మంచంమీద నుండి లేవడం లేదనీ చివరి క్షణాలలో ఉన్నాడనీ రాసింది.

నాకిక లండన్‌లో ఒక్కక్షణం కూడా ఉండ బుద్ధి కాలేదు. వెంటనే యార్‌మౌత్‌కి బయలుదేరి వెళ్ళాను.

తలుపు తట్టగానే పెగోటీ వచ్చి తలుపు తీసింది. నన్ను చూసి ఎంతో సంతోషించాడు. మిసెస్ పెగోటీ బార్కిస్ వచ్చి నన్ను కౌగలించుకుని కంటతడి పెట్టుకుంది. నన్ను వెంటబెట్టుకుని బార్కిస్ పడుకుని ఉన్న గదిలోకి తీసుకు వెళ్ళింది. బార్కిస్ శవంలా మంచానికి అంటిపెట్టుకుని ఉన్నాడు.

"బార్కిస్ మైడియర్! నిన్ను చూడటానికి ఎవరు వచ్చారో చూడు!" అంది పెగోటీ.

బార్కిస్ నీరసంగా కళ్ళు తెరిచి బలవంతంగా తలెత్తి నా వంకచూసాడు. అంత బాధలోనూ అతడి పెదవులమీద చిరునవ్వు తొణికిసలాడింది. నన్ను తన సరసన కూర్చోమని సంజ్ఞ చేసాడు. కూర్చున్నాను.

"బాగున్నావా మైలిటిల్ బాయ్!" అన్నాడు.

నేను తల ఆడించాను. నాకు దుఃఖం పొంగుకొస్తున్నది. అయినా తమాయించుకున్నాను.

నాతో ఆ ఒక్కమాట మాట్లాడిన మరుక్షణం బార్కిస్ ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి. అందరూ గొల్లుమన్నారు....

బార్కిస్ కర్మకాండ అయ్యేంత వరకూ నేను అక్కడే ఉన్నాను. నేను తిరిగి లండన్‌కు బయలుదేరాను. పెగోటీ నా వెంట వస్తానంది. బార్కిస్ తన వీలునామాలో తన ఆస్తిని, పెగోటీకి చెందేటట్టు రాసాడు. ఆ విషయం మిస్టర్ స్పెన్‌లోతో మాట్లాడేందుకు పెగోటీని తీసుకుని బయలుదేరాను.

చివరకు మేము లండన్ చేరుకున్నాము.

## 7

వీలునామా ప్రకారం పెగోటీకి డబ్బూ దస్కం వచ్చే ఏర్పాటు చేశాడు మిస్టర్ స్పెన్‌లో. మా వద్ద సెలవు తీసుకుని పెగోటీ తిరిగి వెళ్ళిపోయింది.

నేను తరుచూ డోరాను కలుసుకుంటూనే ఉన్నాను.... కొన్ని రోజుల తర్వాత డోరా పుట్టినరోజు పండుగ వచ్చింది....నాకు ఆహ్వానం వచ్చింది. ఆ రోజు వెళ్ళాను.



డేవిడ్ తన కూతుర్ని ప్రేమిస్తున్న విషయం లాయర్‌కి తెలిసి, డేవిడ్‌తో వాళ్ళ వివాహం జరగదని చెప్పుట!

హడావిడి తగ్గిన తర్వాత నేనూ, డోరా తోటలో కూర్చున్నాము.

"ఏదో చెప్పాలనుకుంటున్నావు. ఏమిటది డేవిడ్?" డోరా నా ముఖం వంక

చూస్తూ అడిగింది.

డోరా చేతిని నా చేతిలోకి తీసుకుంటూ "డోరా! భగవంతుని సాక్షిగా నిజం చెబుతున్నాను. నువ్వు లేకపోతే నేను జీవించలేను. నిన్ను వివాహం చేసుకోవాలనుకుంటున్నాను. నీ ఉద్దేశమేమిటి, మైడియర్!" అని అడిగాను.

"ఆ మాట నువ్వు ఎప్పుడో అడగవలసింది. ఇప్పటికైనా అడిగావు. సంతోషం!....నేను, నిన్ను తప్ప ఎవ్వరినీ వివాహం చేసుకోను డేవిడ్!" అంది డోరా ఆనందంగా.

నా సంతోషానికి మేరలేకపోయింది.

"అయితే ఒక్క విషయం డేవిడ్!"

"ఏమిటది?"

"మరేంలేదు. సమయం వచ్చేవరకు, ఈ విషయాన్ని ఎవరికీ తెలియనివ్వరాదు" అంది డోరా.

దానికి నేను అంగీకరించాను!

ఒకరోజున, మామూలుగా ఆఫీసుకు వెళ్ళాను. మిస్టర్ స్పెన్‌లో నాకంటె ముందుగానే ఆఫీసుకు వచ్చి ఉన్నాడు. మనిషి చాలా నీరసంగా కనిపిస్తున్నాడు.

"మిస్టర్ డేవిడ్! నీతో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలి. అలా హోటల్‌కి వెళ్ళి మాట్లాడుకుందాం పద!" అన్నాడు స్పెన్‌లో.

మేము ఇద్దరం హోటల్‌కి వెళ్ళాము. అయితే స్పెన్‌లో నన్ను అక్కడ కూర్చోనీయకుండా, మేడమీదికి తీసుకువెళ్ళాడు. అక్కడ హోటల్ గదిలో మిస్ మర్డ్‌స్టోన్ కూర్చుని ఉంది. ఆమె చేతిలో నేను డోరాకు రాసిన ప్రేమలేఖల కట్ట ఉంది.

నాకూ, డోరాకు మధ్య ఉన్న ప్రేమ వ్యవహారం బట్టబయలైంది— మిస్ మర్డ్‌స్టోన్‌కు నా మీద ఉన్న ద్వేషభావాన్ని యిలా వెల్లడి చేస్తుందనుకోలేదు.

"నేనూ, మీ అమ్మాయి ప్రేమించుకున్నాం!.... వివాహం కూడా చేసుకోవాలనుకుంటున్నాము" అన్నాను స్పెన్‌లోతో.

"నువ్వింకా చిన్నకుర్రవాడివి! నా దగ్గర వివాహం ఊసు ఎత్తకు! నీ దగ్గర ఉన్న మా అమ్మాయి రాసిన ఉత్తరాలు తెచ్చి యివ్వు! ....వాటిని కాల్చిపారేస్తాను. ఇంతటితో ఈ విషయాన్ని నువ్వూ, నేనూ కూడా మరచిపోదాం!అదే మంచి పద్ధతి" అన్నాడు స్పెన్‌లో,

నేను ఎంత చెప్పినా స్పెన్‌లో వినిపించుకోలేదు నా మనసులో ఆందోళన ప్రారంభమైంది. ఆఫీసుకు వెళ్ళబుద్ధి కాలేదు. ఆ మధ్యాహ్నం వరకు ఎక్కడెక్కడో తిరిగి ఇంటికి చేరుకున్నాను.

ఆ మర్నాడు ఉదయం ఆఫీసుకు వెళ్ళాను. ఆఫీసు గుమాస్తా ఫేటికి అభివాదములు తెలియజేసాను.

"ఎంత భయానకమైన సంఘటన ఇది! ఆఫీసు అంతా శూన్యంలో మునిగి పోయినట్టు వుందికదూ!" అన్నాడు టిఫే.

"ఎందుకని? ఏం జరిగింది మిస్టర్ టిఫే?" అని అడిగాను.

టిఫే ఆశ్చర్యపోతూ "అయితే మీకి విషయమే తెలియదా?" అన్నాడు.

"ఊఁహూ....! తెలియదు ఏమిటిది?"

"మిస్టర్ స్పెన్‌లో చనిపోయారు!" అన్నాడు టిఫే.

నానవనాడులూ క్రుంగిపోయాయి. ముఖం పాలిపోయింది. అక్కడే కూల బడి పోయాను. టిఫే మంచినీళ్ళు తెచ్చియిచ్చాడు. తాగి కొంతసేద దేరాను.

"ఇది ఎప్పుడు జరిగింది?" అని అడిగాను.

"నిన్నసాయంత్రం అనుకుంటాను అతను తన గుర్రపు బగ్గినితోలు కుంటూ వెళ్ళాడట. ఓ గంట గడిచిన తర్వాత బండి తిరిగి ఇంటికి వచ్చిందట. అయితే బండిలో స్పెన్‌లో లేరట. నౌకర్లు అతడ్ని వెదుక్కుంటూ వెళితే ఆయన ఒకచోట రోడ్డుమీద బోర్లాపడి, చనిపోయి ఉన్నారట." అని చెప్పాడు టిఫే.

"అతని చావుకు కారణమేమై ఉంటుందంటావ్?" అని అడిగాను.

"స్పెన్‌లోకి అప్పులు చాలా ఉన్నాయి. అతను నిన్న అప్పులన్నీ తీర్చే



డోరా తండ్రి ఆత్మహత్య చేసుకున్న తర్వాత డేవిడ్
డోరాను వివాహం చేసుకొనుట!

సాడు. కేవలం వేయి పౌండ్లు మాత్రమే మిగిలాయి. వాటిని తన కుమార్తెకు మిగిల్చి వెళ్ళిపోయాడు." అన్నాడు టిఫే.

నేను చాలా బాధపడ్డాను. ఇదంతా నా వల్లనే జరిగింది. మిస్టర్ స్పెన్‌లో మరణానికి కొంత నేను కూడా కారణ భూతుడనే! అనుకున్నాను.

కర్మ కాండ జరిగిన తర్వాత వెళ్ళి డోరాను కలుసుకోవాలను కున్నాను.

ఒకనాడు డోరా స్నేహితురాలు కనిపించి, డోరా యిక్కడ లేదనీ తండ్రి చనిపోయిన తర్వాత మనసు వికలంకాగా తనమేనత్తల దగ్గరకు వాళ్ళ ఊరు వెళ్ళి పోయిందనీ తెలియజేసింది.

ఏం చేయాలో నాకు తోచలేదు. అదే సమయంలో 'ఆగ్నెస్' నన్ను చూసేందుకు కాంటర్ బర్రీనుంచి వచ్చింది. ఆమె తరచూ నన్ను కలుసుకుంటూ ఉండేది.

నేను ఆగ్నెస్‌తో డోరా గురించిన విషయాలన్నీ చెప్పి బాధపడ్డాను.

ఆగ్నెస్ నవ్వి "ఇప్పుడు నీకు ఇరవై ఒక్క సంవత్సరం నిర్భయంగా డోరా ఉంటున్న ఊరు వెళ్ళు. ఆమె మేనత్తలతో మాట్లాడు నిన్ను పెళ్ళి చేసు కోవడం డోరాకు అంగీకారమో కాదో తెలుసుకో? అంతేకాని యిలా కూర్చుని ఆలోచించడంవల్ల ప్రయోజనమేముంది?" అని సలహా చెప్పింది.

నేను డోరా ఉంటున్న ఊరు వెళ్ళాను. డోరా మేనత్తలను కలుసు కున్నాను. డోరా ఉద్దేశమేమిటో తెలుసుకున్నాను.

చివరకు అందరూ మా వివాహానికి అంగీకరించారు. పెళ్ళి రోజు నిశ్చయ మైంది. మా మేనత్త చాలా సంతోషించింది. అగ్నెస్ కూడా ఆనందించింది. ఒక

రోజున ఆగ్నేస్‌ని తీసుకువెళ్ళి డోరాకు పరిచయం చేసాను. ఇద్దరూ ప్రాణస్నేహితులుగా మారిపోయారు.

నేను యిప్పుడు ఓ మంచి లాయర్ని. బాగానే సంపాదిస్తున్నాను. తీరిక వేళల్లో రచనలు చేస్తున్నాను. రచయితగా మంచి పేరు కూడా సంపాదించుకున్నాను.

మా మేనత్త కొంతకాలంగా నాతో బాటే బకింగ్ హామ్ వీధిలో ఉంటున్నది.

డోరాతో నా వివాహం జరిగింది. వివాహానికి అందరూ వచ్చారు. మా మేనత్త మమ్మల్ని ఏకాంతంగా విడిచి తిరిగి డోవర్‌కి వెళ్ళిపోయేందుకు నిశ్చయించుకుంది.

"మాకు, నువ్వు పెద్దదిక్కుగా ఉండకుండా వెళ్ళిపోతావా, ఆంటీ?" అంటూ బాధపడ్డాను.

"వద్దు నాయనా!.... పడుచు దంపతుల మధ్య ముసలివాళ్ళు ఉండటం భావ్యంకాదు. దానివల్ల చాలా అనర్థాలు సంభవిస్తాయి. మీరు ఒకరి లోపాలు మరొకరు తెలుసుకుంటూ, వాటిని ప్రేమతో, అనురాగంతో సరిదిద్దుకుంటూ, ముందుకు సాగిపొండి!— ఇప్పుడు మీ భవిష్యత్తును మీరే నిర్ణయించుకోండి. ఇంతకాలం నువ్వు

ఒంటరిగాడివి. ఇప్పుడు నీకొక తోడు, జీవిత భాగస్వామిని లభించింది. జీవితాన్ని సుఖమయం చేసుకో. ఈ మేనత్త దూరంగా వున్నా, ఎప్పటికప్పుడు నీ బాగోగులు గమనిస్తూనే వుంటుంది." అంది మా మేనత్త.

ఆమె వెళ్ళిపోయింది. ఆ తర్వాత మేము బకింగ్‌హోమ్ వీధి నుండి మా ఇంటిని, మరొక సుందర కుటీరానికి మార్చాము. డోరా నాకు అన్నివిధాలా అనుకూలవతి అనిపించుకుంది.

రోజులు హాయిగా గడిచిపోతున్నాయి!—

## 8

మా వివాహమై ఒక సంవత్సరం కావస్తున్నది. కొంతకాలంగా డోరాకు అస్వస్థతగా వుంటున్నది. డాక్టర్లు వస్తున్నారు. పరీక్షచేసి మందులు వాడుతున్నారు. అయినా గుణం కనిపించలేదు.

రాను రాను డోరా పరిస్థితి ఆందోళనకరంగా పరిణమించింది. మా మేనత్తకు డోరా జబ్బు పరిస్థితిని తెలియజేస్తూ, ఉత్తరం రాసాను. మా మేనత్త తక్షణం బయలుదేరి వచ్చింది.

"ఆగ్నెస్‌ని ఒక్కసారి రమ్మని కబురుపెట్టండి!" అంది డోరా.

నేను ఆగ్నెస్‌కి కబురు చేసాను. ఆమె వచ్చింది. అందరం రోజల్లా, డోరా మంచం వద్దనే కూర్చునేవాళ్ళం.



డోరా చావు బ్రతుకుల మధ్య కొట్టుకుంటూ ఆగ్నెస్‌తో, తన చివరి కోరిక చెప్పుట!

"చూడు నాయనా! డోరా పరిస్థితి గాబా విషమించింది. ఆమె బ్రతుకుతుం

దన్న ఆశ కనిపించడంలేదు. ఘడియకో, క్షణానికో అన్నట్టు వుంది. ఎంత కష్టం వచ్చిందిరా నీకు!" అంది మా మేనత్త.

అందరూ నన్ను డోరా వద్ద విడిచి క్రిందికి వెళ్ళిపోయారు. నేను కంట తడి పెట్టుకున్నాను.

"ఏడుస్తున్నావా డేవీ!.... నేను చనిపోతానని బాధపడుతున్నావా మైడియర్!....నువ్వు క్రిందికి వెళ్ళి 'ఆగ్నేస్'ని పైకి రమ్మని చెబుతావా?....ఆమెతో ఏకాంతంగా మాట్లాడాలి!" అంది డోరా.

నేను క్రిందికి వచ్చి ఆ విషయాన్ని ఆగ్నేస్‌తో చెప్పాను. ఆమె గబగబా పైకి వెళ్ళింది.

కొన్ని క్షణాలు గడిచిన తర్వాత చిన్నగా ఏడుస్తూ క్రిందికి దిగి వచ్చింది.

"ఏం జరిగింది ఆగ్నేస్?" అని అడిగాను భయపడుతూ.

"జరగవలసినదే జరిగింది, డేవీ!.... డోరా మనకిక లేదు" అంటూ ఆగ్నేస్ బావురుమంది—

డోరాకు కర్మకాండ అదీ పూర్తి అయిన తర్వాత నాకిక లండన్‌లో ఉండ బుద్ధి కాలేదు. మా మేనత్త తిరిగి డోవర్ వెళ్ళిపోయింది.

కొద్దిరోజులు గడిచిన తర్వాత, నేను లండన్ విడిచిపెట్టాను. నాకు ప్రియమైన వారినందర్నీ విడిచిపెట్టాను.

కొన్ని నెలలపాటు, ఒక దేశం నుండి మరొక దేశం, పిచ్చివాడిలాగ, ఏకాంతంగా ప్రయాణం చేసాను.

చివరకు స్విట్జర్లాండ్ చేరాను. అక్కడ ప్రశాంత వాతావరణంలో కొంత కాలం స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నాను. అక్కడే నా రచనా వ్యాసంగాన్ని పునఃప్రారంభించాను.

నా జీవిత విశేషాలను ఓ కథగా రాసి, దానిని నా స్నేహితుడైన ట్రాడిల్స్‌కి లండన్ పంపించాను. అతడు దానిని ఓ పత్రికలో అచ్చు వేయించాడు. తర్వాత నేను ఎన్నో రచనలు అతడికి పంపిస్తూ వచ్చాను. అన్నీ అచ్చు అవుతూనే వుండేవి.

దానితో నాకు పేరు ప్రఖ్యాతులే గాకుండా, బోలెడు ధనం కూడా వచ్చింది—

నాకు బాగా యుక్తవయసు వచ్చేసరికి, నా ఆలోచనలు ఆగ్నెస్ మీదికి మళ్ళాయి. ఆమె గురించి ఆలోచించడం ప్రారంభించాను.

'ఆగ్నెస్ నా చిన్ననాటి స్నేహితురాలు. ఆమె నన్ను ప్రేమించింది. ఆ విషయాన్ని ఇప్పటికి గాని తెలుసుకోలేకపోయాను. నేను డోరాని ప్రేమించాను. బహుశా యీ విషయంలో ఆగ్నెస్ చాలా బాధపడి వుంటుంది. కానీ యదార్థానికి నేను ప్రేమించింది ఆగ్నెస్‌నేనని యిప్పుడు తెలుసుకున్నాను. కానీ ఏం లాభం? సమయం మించిపోయింది. ఆగ్నెస్ యూరియాహీప్‌ని యీపాటికి వివాహం చేసుకునే వుంటుంది-' అనుకున్నాను.

ఆ విధంగా మూడు సంవత్సరాలు గడిచిపోయాయి. ఇక ఏకాంత జీవితం, విదేశాలలో గడపడం కష్టమనిపించింది.

తిరిగి ఇంగ్లండ్ చేరుకున్నాను. లండన్‌లో బసచేసి, ఒకనాటి మధ్యాహ్నం నా స్నేహితుడు ట్రాడిల్స్‌ను కలుసుకునేందుకు వెళ్ళాను.

ట్రాడిల్స్ వివాహం చేసుకున్నాడు. లాయర్‌గా ప్రాక్టీసు చేస్తున్నాడు.

ఆ మర్నాడు మా మేనత్తను కలుసుకునేందుకు డోవర్ బయలుదేరాను. ఇంటికి చేరుకుని తలుపు తట్టాను. మిస్టర్ డిక్ వచ్చి తలుపు తీసాడు. నన్ను చూసి ఎంతో సంబరపడిపోయాడు. మిస్టర్ డిక్ తిరిగి పనిలో చేరి వుంటాడనుకున్నాను.

మా మేనత్త నన్ను చూసి ఎంతో సంతోషించింది. ఆప్యాయంగా కౌగలించుకుంది. వంట ఇంటిలో నుండి పెగోటీ యివతలికి వచ్చింది.

"మైడియర్ బాయ్!....ఎన్నాళ్ళకు చూసాను!" అంది పెగోటీ.

"నీ చిన్ననాటి నర్స్. మిసెస్ పెగోటీ బార్కిస్ నా దగ్గరే వుంటున్నది" అంది మా మేనత్త నవ్వుతూ.

అందరం ఒకచోట కూర్చుని ఎన్నో కబుర్లు చెప్పుకున్నాము.

మా మేనత్త ఏకాంతంగా వున్నప్పుడు, "మిస్టర్ విక్ ఫీల్డ్, అతని కుమార్తె ఆగ్నేస్ ఎలా వున్నారు అంటీ?.... ఆగ్నేస్ ఇప్పటికీ పెళ్ళికాకుండానే వుందా?" అని అడిగాను.

"ఆగ్నేస్ వివాహం చేసుకోవాలంటే, ఇరవైసార్లు ఇరవై మందిని చేసుకుని వుండేది."

"అందులో ఎటువంటి సందేహమూ లేదనుకో! అయితే ఆమెకు ఎవరితోనైనా ప్రత్యేకమైన అనుబంధం ఏదైనా వున్నదంటావా?" అని అడిగాను.

మా మేనత్త నెమ్మదిగా తలెత్తి నా ముఖంలోకి సూటిగా చూస్తూ "అటువంటిదేదో ఆమెకు వున్నదనే అనుకుంటున్నాను. ఆమె ధైర్యంగా నాతో ఏ విష

యమూ చెప్పదు కదా! ఆమెకు, నా మీద సమ్మతం వుండదు. పరిస్థితులనుబట్టి నేను ఊహించాను. అంతే" అంది.

మర్నాడు ఉదయాన్నే నేను కాంటర్‌బర్రీ వెళ్ళాను. నేను మొదట స్కూలులో చదువుకునేందుకు వెళ్ళినప్పుడు వున్న విధంగా లేదు. ఇంటిలో కొంత మార్పు వచ్చింది. ఇల్లంతా తీర్చిదిద్దినట్టు వుంది.

ఆగ్నెస్ హాలులోకి వచ్చింది!.... నన్ను చూడగానే, ఆమె కళ్ళల్లో ఏదో కాంతి తళుక్కున మెరిసింది.

"నన్ను చూస్తూనే ఆశ్చర్యపోయి వుంటావు కదూ ఆగ్నెస్!" అన్నాను నవ్వుతూ.

"లేదు! లేదు! నాకు చాలా ఆనందంగా వుంది" అంది ఆగ్నెస్.

ఇద్దరం కూర్చున్నాము. ఎన్నో విషయాలు మాట్లాడుకున్నాము. డోరా విషయాలు ఆమె మరణం మా సంభాషణలో అధిక ప్రాధాన్యత పొందాయి.

ఆమెవద్ద సెలవు తీసుకుని వచ్చేసాను!....నేను వచ్చి రెండు నెలలు కావస్తున్నది. నేను తరచూ వెళ్ళి ఆగ్నెస్‌ని కలుసుకుంటూనే వున్నాను. ఆమె తన

వివాహం గురించికానీ ఆమెకు ఎవరితో ప్రత్యేకమైన అనుబంధం ఉందో అతని గురించికానీ నాతో ఏమీ చెప్పలేదు.



ఆగ్నెస్‌ని వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్న డేవిడ్ ఆమె ఇంటికి వెళ్ళి ఏవో మాటలతో ఆమె మనసు నొప్పించుట!

ఒకనాడు మా మేనత్తతో "ఆంటీ! ఈ విషయం చెప్పు? ఆగ్నెస్‌కి నిజంగానే మరొకరితో ప్రత్యేకమైన అనుబంధం ఉన్నదంటావా?" అని అడిగాను.

"ఉన్నదనే నేను భావిస్తున్నాను. బహుశా ఆగ్నెస్ ఆ యువకుడినే వివాహం చేసుకోవచ్చు" అంది మా మేనత్త.

నాలో నీరసం ఆవరించింది.

"భగవంతుడు ఆమెను కాపాడాలి" అన్నాను.

"భగవంతుడు ఆమెనూ, ఆమె భర్తనుకూడా కాపాడుగాక!" అంది మా మేనత్త.

నేను కాంటర్ బర్రీ వెళ్ళి ఆగ్నెస్‌ని కలుసుకున్నాను. ఆమె ఒంటరిగానే వుంది.

"ఆగ్నెస్! మనం చిన్ననాటి మిత్రులం!—అయినాసరే నువ్వు నా దగ్గర ఓ రహస్యాన్ని దాచావు. దానిని వెల్లడిచేస్తే నీ ఆనందంలో నేనూ భాగం పంచుకుంటాను కదా!" అన్నాను.

"రహస్యమా! ఏమిటది?" అంది ఆగ్నెస్ ఆశ్చర్యపోతూ.

"నీ ప్రేమ సంపదను ఎవరో వ్యక్తికి సంతోష పూర్వకంగా సమర్పించబోతున్నావని నాకు తెలిసింది!....ఆ అదృష్టవంతుడు ఎవరో నాకు చెప్పకూడదా ఆగ్నెస్?" అన్నాను.

నేను అలా అన్నానో లేదో ఆమె కళ్ళు అమితవేగంతో నావేపు చూసాయి.

ఆ చూపులో కోపం ఉంది. బాధ ఉంది. ఆవేదన ఉంది. ఆక్రోషం ఉంది. ఆమె కూర్చున్నచోటునుండి ఒక్కుదుటున లేచి వేగంగా గది చివరికి వెళ్ళింది. ఆ తర్వాత పెద్దపెట్టున ఏడవడం ప్రారంభించింది.

ఆమె అంత బాధగా, పెద్దగా దుఃఖించడం నేను ఎన్నడూ చూడలేదు. ఆమె కన్నీరు నన్ను కదిలించివేసింది.

ఆమె నెమ్మదిగా యిలా అంది :

"నువ్వు నన్ను తప్పుగా అర్థంచేసుకున్నావు డేవీ!— నేను ఏదయినా రహస్యం దాచి వుంచితే అది కొత్తదేమీకాదు. ఆ రహస్యాన్ని నువ్వు ఏ విధంగా భావిస్తున్నావో ఆ భావం మాత్రం నా మనసులోలేదు" అంది ఆగ్నేస్ ఏడుస్తూ.

"ఆగ్నేస్! మైడియర్ ఆగ్నేస్! నా భావమేమిటో, నా మనసులో ఏముందో చెబుతాను విను!....ఆగ్నేస్ ఎల్లవేళలా నాకు మార్గదర్శకురాలు....నాకు

బలాన్ని చేకూర్చే పునాదిరాయి! నేను డోరాని ప్రేమించినప్పుడు కూడా ఆగ్నెస్ సహాయ సహకారాలు లేనిదే, ఆ ప్రేమ వర్ధిల్లలేదు. నేను డోరాని పోగొట్టుకు



చివరకు డేవిడ్, ఆగ్నెస్‌ల వివాహం జరిగి వాళ్ళు హాయిగా ఉండుట!

న్నప్పుడుకూడా ఆగ్నెస్ లేకుండా నేను ఏమీ చేయలేకపోయాను. నేను ఈ దేశం విడిచి వెళ్ళినప్పుడు కూడా నిన్ను ప్రేమించాను ఆగ్నెస్!—నేను అన్ని సంవత్స

రాలు విదేశాలలో ఏకాంతంగా గడిపానూ అంటే, నిన్ను ప్రేమిస్తూనే గడిపాను. నేను తిరిగి బ్రిటన్ వచ్చానంటే నిన్నూ నీ ప్రేమనూ మరచిపోలేకనే తిరిగి వచ్చాను" అన్నాను గాద్గదికంగా.

మరుక్షణం ఆగ్నేస్ వెనుదిరిగింది. బాణంలా దూసుకుంటూ వచ్చి నా హృదయంమీద వాలిపోయింది.

"చిన్ననాటి ఆ స్కూలు జీవితం గడపడానికి మా ఇంటికి వచ్చావు జ్ఞాపకముందా డేవీ!.... ఆ రోజునే ఆ చిన్నవయసులోనే నీ మీద నా మనసు లగ్నమైంది. ఆ ప్రేమ ఈ నాటివరకూ బలపడుతూ వచ్చింది." అంది ఆగ్నేస్.

నేను ఎంత ఆనందించానో చెప్పలేను! మేమిద్దరం కలిసి డోవర్ వచ్చాము. మా మేనత్తతో సహా ఇంట్లోని వాళ్ళంతా ఎంత సంబరపడి పోయారో చెప్పలేను.

ఆగ్నేస్‌కి నాకూ వివాహమైంది!

ఆ రాత్రి ఆగ్నేస్ నాతో యిలా అంది.

"నేను ఒకే ఒక్క విషయాన్ని నీకు చెప్పకుండా దాచాను. నా ప్రియమైన భర్తగారూ!....ఇప్పుడు మనకు వివాహం అయింది కనుక ఆ విషయాన్ని వెల్లడి చేయాలనుకుంటున్నాను. అనుజ్ఞయిస్తారా?" అంది ఆగ్నేస్ నవ్వుతూ.

"చెప్పుడియర్!" అన్నాను.

"డోరా చనిపోయిన రాత్రి ఆమె నన్ను తన దగ్గరకు ఒంటరిగా రమ్మన్నదని, నువ్వు వచ్చి చెప్పావుకదా! నేను పైకి వెళ్ళాను. డోరా నన్ను తనదగ్గర కూర్చోమని "చూడు ఆగ్నేస్ నేను బ్రతకను!....నేను లేకపోతే నా దేవి ఒంటరి వాడై పోతాడు. చిన్న తనంనుండీ కష్టాలు అనుభవిస్తూనే ఉన్నాడు! ఆగ్నేస్.... నువ్వు త్రికరణ శుద్ధిగా నా స్థానాన్ని ఆక్రమించుకోవాలని కోరుకుంటున్నాను అలాగని నాకు వాగ్దానం చెయ్!" అంది. నేను ఆమెకు మాట యిచ్చాను. ఆ తర్వాతనే ఆమె హాయిగా కన్నుమూసింది!" అని చెప్పింది ఆగ్నేస్.

"మరి ఆ విషయం నాకెప్పుడూ చెప్పలేదేమి?" అన్నాను.

"అందరూ అది నా స్వార్థం అనుకుంటారు. అందుకని చెప్పలేక పోయాను." అంది ఆగ్నెస్.

నేను ప్రేమతో ఆగ్నెస్ తల నిమిరాను. ఆమె గోముగా, నా బాహువుల్లో ఇమిడి పోయింది.

